మార్గమునుండి రొండపడి దగాలుచు, సోలుచు, వచ్చువారి, వ్యా
పారము ముందుజూచి, యటుపైని తదన్యుల సాగసంప్రమణ
వాగిలచెంత నుంత ధనవాంఛన జూపవుగాన "సబ్ రిజ
స్ట్రారు"న నీకెచెల్లు, పరివత్తురె యన్యులు నాగభూషణా !

(కె. రామమూర్తి.)

# రాజపోషకులు.

మ. రా. రా. శ్రీ "దేశోద్ధారక" కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

,, శ్రీకాకుళం పట్టాభిరామయ్య గుప్తగారు.

,, "ఆంధ్రనాటకకళోద్ధారక" వనారస గోవిందరావుగారు.

,, జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు.

,, గరికపర్తి నాగభూషణ దేవరగారు, B. A., సబ్ రిజిస్ట్రారు.

,, సిద్ధాంతి, శిరోభూషణ, పండిత, దోగిపర్తి స్వామి గుప్తగారు.

# పోషకులు.

మ. రా. రా. శ్రీ పులిపాటి కుమారస్వామిగారు, బ్యాంకరు, గుంటూరు.

,, బూదరాజు వెంకటసుబ్బయ్య పంతులుగారు, భూస్వామి, స్వర్ణ.

,, పి. సూర్యనారాయణగారు, B. A., కమీషను ఏజంటు, చీరాల.

,, పేటేటి వెంకటాద్రి నాయుడుగారు, చీరాల.

,, తడవర్తి సీతారాం శాస్త్రిగారు, మునిసిపల్ కౌన్సిలరు అండ్ ప్రెసిడెంటు, నేషనల్ బ్యాంకు లిమిటెడ్, రాజమండ్రి.

మ. రా. రా. శ్రీ ఊటుకూరి లక్ష్మీనృసింహ దాసు గారు,
భూస్వాములు, వేటపాలెం.
,, నారపరాజు రామమూర్తి పంతులుగారు,
భూస్వాములు ఇంకొల్లు.
,, వై. వి. కృష్ణయ్యగారు, చీరాల.
,, సయ్యద్ దాదాసాహెబ్ బహద్దర్ గారు,
దగ్గుపాడు.
,, శృంగవరపు అంజయ్యగారు,
కంట్రాక్టరు, పర్చూరు.
,, నాయని నరసింహ్వారావు నాయుడుగారు,
B. A., B. L., అడ్వకేటు, ఒంగోలు.
,, పి. బుచ్చప్ప నాయుడుగారు, B. A., B. L.,
ఒంగోలు.
,, చల్లం శేషయ్య గుప్తగారు,
కంట్రాక్టరు, వేటపాలెం.
,, కీ॥ శే॥ గాలి రామస్వామి చౌదరిగారు,
ఇంకొల్లు.
,, దగ్గుపాటి పాపయ్య చౌదరిగారు,
భూస్వాములు, కారంచేడు.
,, రావుబహద్దర్, తుంపూడి భగవన్తమ్
గుప్తగారు, B. A., B. L.,
రిటైర్డు కలెక్టరు.
,, పాటిబండ్ల శ్రీమన్నారాయణ చౌదరిగారు,
ప్రెసిడెంటు, పంచాయితీబోర్డు, భీమవరము.



# విజ్ఞప్తి.

పాఠకమహాశయులారా!

భాషా యోషామణికి భూషణమగు గ్రంథ కుసుమ హారమున నేనొక పుష్పమును జేర్చి పూజనము గావింపఁదలఁచి యీ పుస్తకమును రచించితిని. ఈకాలమునఁ బౌరాణికగాథ లెన్నియో గద్యరూపమున వెలువడుచున్నను గొంత యభినవముగాఁ గూర్చి యీ యుపాఖ్యానమును నవలారూపమున వ్రాసితిని.

ఈకథ భాగవతము, విష్ణుపురాణము మున్నగు గ్రంథములలోఁ గలదు అందు నొక గ్రంథములోని కథకును, మఱియొక గ్రంథములోని కథకును గొంచెము వ్యత్యాసము గలదు. పై గ్రంథము లాధారముగాఁగొని మూలకథకు భంగము గలుగకుండునటులఁ గొన్ని చిన్నిమార్పులను గలిగించితిని. గ్రంథాదిని మాధవశర్మయను బ్రాహ్మణుని గల్పించి, తన్మూలమున ధ్రువ జననమును సూచించితిని. ధ్రువుని మధువన ప్రవేశ వృత్తాంతమును జేనికి నారదుఁ డెఱిఁగించినరీతి సునీతికిఁ దెలియఁజేయుటకై 'గుణవతి' యను దాసిని గల్పించితిని. ఇంకను సందర్భానుసరణి నచ్చటచ్చ టొకింత నూతన విధాన మవలంబించి వ్రాసితిని. ఔచితి ననుసరించి భాగవతము, విష్ణుపురాణములోని పద్యములే యందందుఁ జేర్చితిని.

ఇయ్యాది ఉన్నత పాఠశాలల విద్యార్థులకుఁ బఠనీయ గ్రంథముగ నుండఁగలదని యభిలషించి రచించితిని. శ్రీవిద్యాధికారులును, ఉపాధ్యాయ మహాశయులును, నాకుఁ దగు ప్రోత్సాహ మొసఁగి చేయూఁత నిచ్చెదరుగాకయని వినయముతోఁ బ్రార్థింపుచున్నాను.

దీని నామూలాగ్రముగఁ జదివి లోపములను సవరించి పీఠిక వ్రాసియిచ్చిన శ్రీయుత, 'ఉభయ భాషాప్రవీణ' ప్రతాప రామకోటయ్య (P. O. L.) గారికిని, వ్రాఁత ప్రతినే యోపికతోఁ జదివియు, వినియు, వారివారి యభిప్రాయము లొసంగిన శ్రీ విద్యాధికులకును నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

దీనిని రచించి సంవత్సరమునకుఁ బై కాలమయినను కారణాంతరములచే ముద్రింప వీలుకలిగినది కాదు. శ్రీయుతులు, కర్లపాలెం కృష్ణారావుగారిని, 'దీనిని ముద్రింపించుఁడ' ని కోరఁగా వారుసమ్మతించి, తమకార్యాలయమునందుఁ బ్రకటించిరి. ఉదారబుద్ధులగు శ్రీకృష్ణారావుగారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

గొట్టిపాడు,
నర్సరావుపేట తాలూకా.

గ్రంథకర్త.



# పీఠిక.

దేశాభ్యుదయమునకుఁ గవీశ్వరులు ఒక విధముగా యథార్థముగాఁ గారకులు. నిర్జలప్రదేశమును క్షణములో దివ్య సరోవరసంశోభితము చేయఁగల శిల్పమునందు వారు ప్రవీణులు నిర్జీవ ప్రతిమకుఁ బ్రాణముపోసి ప్రపంచరంగమున మనోహరముగఁ దత్పాత్రములను నటింపఁ జేయఁగలఁ సృష్టి రచనమునందు వారు అపరబ్రహ్మలు. భారతాది మహాగ్రంథాంతర్గత శకుంతలోదంతమునకుఁ జైతన్య శక్తినిచ్చి కాళిదాసు శాకుంతల నాటకమును రచించినాఁడు మార్కండేయ పురాణాంతర్గతమగు చిన్ని కథనుగైకొని పెద్దన జీవము పోసినాఁడు.

ఇట్టి ఉత్కృష్ట సృష్టిచిహ్నములే శ్రీయుత, వారణాసి వేంకటేశ్వర విరచితమగు "ధ్రువకుమార విజయము" నందు అగపడుచుండుట ముదావహము. భాగవతాది గ్రంథాంతర్గతమగు ధ్రువ చరిత్రమును ఆధారముగఁ జేసికొని, ఒక రమణీయ సంవిధాన శోభావిరాజమానమగు సత్కృతిని సృష్టింపఁ గలిగినాఁడు.

కథావిధానములోను గ్రంథకర్తగారు స్వతంత్రించి విషయములను విపులీకరించినారు. భక్తియననేమో, భక్తలక్షణము లెట్టివో, భగవదారాధన మెట్లుండవలెనో, తపమననేమో మున్నగు విషయములను నారదునిమూలమున ధ్రువునకు విపులముగాఁ జెప్పించినారు. ఈ చెప్పించుట బాలుర భావిజీవిత సౌధనిర్మాణమున కెంతయుఁ దోడ్పడఁగలదనుటలో నబద్ధము లేదు. ఈ విషయపరిశీలనమునందు గ్రంథకర్తగారు తమకుఁగల పూర్వగ్రంథపరిచయమును సూచించినారు. భక్తినిగూర్చి భక్తలక్షణములను గూర్చి చెప్పునప్పుడు నారదభక్తిసూత్రములు, శివానందలహరి మొదలగు గ్రంథములు గ్రంథకర్తగారి స్మృతిలో నున్నట్లు తెల్లమగుచున్నది.

మొత్తముమీద గ్రంథకర్తగారు యీ చిన్నికథను రచించుటలో అన్నివిషయములందును స్వతంత్రించి నూతనమార్గమున నడిచినారనక తప్పదు. ఇంక వీరికిఁగల భాషాపటిమను గూర్చి నేనగ్గడించుటకంటెఁ బాఠకులే నిర్ణయించుకొనుట మంచిది. ప్రాథమిక విద్యాప్రపంచములో నిట్టి భాషాజ్ఞానమును, భాషాభిమానమును గల గురువులుండుట అరుదు. ఇట్టివారున్నప్పుడే బాలుర విద్యాపరిజ్ఞానము పెంపొందుచున్నది. ఈ కాలమున గౌరవము పొందుటకు పాండిత్యముకంటె డిగ్రీలు ముఖ్యమైనను, డిగ్రీలులేవని యీ గ్రంథకర్తగారిని చులకనసేయక నిజమైన పాండిత్యమును గ్రహించి, యెక్కుడు గౌరవముతోఁ బాఠకలోక మాదరించుగాకయని నమ్ముచున్నాను.

గుంటూరు, 24—9—34.

(Sd.) మహావాది వేంకటరత్నము,
ఆంధ్రోపన్యాసకుఁడు, ఆంధ్రక్రైస్తవకళాశాల.

# శ్రీయుతులు, శతావధాని,
# ములుకుట్ల వేంకటకృష్ణ శాస్త్రిగారు.

మిత్రమా!

భవద్విరచితమగు గద్యాత్మక ధ్రువకుమారవిజయమును స్థాలీపులాకన్యాయముగ నచ్చటచ్చటఁ దిలకించితిని. ఇది దీర్ఘసమాసములు, వర్ణనాబాహుళ్యము లేక సమంజసములగు కల్పనలతో బాల విద్యార్థుల కుచితరీతుల నీతి భక్తి బోధకముగా నున్నది. పాఠకుల కాహ్లాదజనకమై, సుగమము హృదయంగమమునై చక్కని శైలిం బ్రవర్తించుచున్నయది. భాషా విషయము క్లిష్టపదంబుల త్రోవకుఁ జనక, సరసపదగతుల నలరారుచు శ్రోత్రపేయముగా నున్నది. వాగ్గుంభనము ఝరిత్యర్థబోధకమై సర్వజనాదరణీయమై నిర్దుష్టముగ నొప్పుచున్నది. ఇత్యాది పాఠశాలలలోని క్రిందితరగతుల బాలురకును, పైతరగతులలోని పాఠకులకుఁగూడ నుపయోగించునదియై మనోహరముగ నున్నది. ఇట్టి గ్రంథముల మఱికొన్ని వ్రాయుటకు భగవంతుఁడు మీకు ధీశక్తి ననుగ్రహించి మిమ్ము దీర్ఘాయువులనుగా నొనర్చుఁగావుత.

తెనాలి,
4-11-1934.

(Sd.) ములుకుట్ల వేంకటకృష్ణశాస్త్రి,
తాలూకా హైస్కూలునందలి ప్రథానాంధ్రోపాధ్యాయుడు.

# శ్రీయుతులు,

# బుద్ధిరాజు రామచంద్రరావుపంతులుగారు,

యం. ఏ., యల్. టి.,

ధ్రువకుమారవిజయము గ్రంథకర్తయగు వారణాసి వేంకటేశ్వరులుగారు కొన్ని ప్రకరణములు నాకు జదివి వినిపించిరి. పురాణపురుషుఁడు, లోకోత్తరుఁడు, బాలభక్తాగ్రేసరుఁడగు ధ్రువరాకుమారుఁడు భక్తిసాధనమున నైహికాముష్మికవిజయములను నొందిన కథను మృదుమధుర వాక్యములతో గ్రంథకర్త నూతన పద్ధతిని పాఠకులకు మనోరంజనమగునట్లు వ్రాసియుండిరని చెప్పు టతిశయోక్తి కానేరదు. ధ్రువచరిత్రాంశములను మూలగ్రంథము లనేకములనుండి క్రోడీకరించి సమయోచితముగ నల్లియున్నారు. ఇట్టి సద్గ్రంథము ప్రతిబాలుఁడు చదివి భక్తి నలవడచేసికొనుటయేకాక మృదువైన భాషాశైలినిగూడ లభ్యము చేసికొనుట కవకాశము కలదని నా నమ్మిక.

బోర్డు హైస్కూలు,
గుంటూరు,
23—10—34.

(Sd.) బుద్ధిరాజు రామచంద్రరావు,
హెడ్ మాస్టరు.



శ్రీయుతులు,

చెన్నుభొట్ల భానుమూర్తిగారు,

బి. ఏ., యల్. టి.,

శ్రీయుత వారణాసి వేంకటేశ్వరులుగారు తామురచిం చిన ధ్రువకుమార విజయములోని కొన్ని ప్రకరణములు నాకు జదివి వినిపించిరి. కథ పురాతనమైనను కథారచనము నూతన ముగాను, మనోరంజకముగాను, నుండి నవలావిధానము నను సరించి యున్నది.

కథ చదువుట కారంభించిన తుదివఱకు చూడితీరవల యునని కోరిక గల్గును.

ఈ గ్రంథమునందుఁ జూపఁబడిన ఉత్తమభక్తి మార్గము భక్తునిలక్షణములు మున్నగునవి ఇప్పటికాలపు విద్యార్థుల మనం బుల నెంతయు నాకర్షించునని గట్టిగా చెప్పఁగలను. ఈ గ్రంథ కర్తకుంగల సహజరచనాశక్తితో ఇంకను నిట్టి పాఠశాలోప యోగ గ్రంథములను వ్రాయుటకు విద్యాధికులు, ధనవంతులు తగిన ప్రోత్సాహము చేయుదురని నమ్ముచున్నాను.

రేపల్లె,<br>24-10-34

(Sd.) చెన్నుభొట్ల భానుమూర్తి,<br>హెడ్ మాస్టరు.

# ఈ నెలలో పోషకులుగ చేరినవారు.



మ. రా. రా. శ్రీ దొప్పలపూడి వీరయ్య చౌదరిగారు,
ప్రెసిడెంటు, పంచాయితీబోర్డు, పొతుకట్ల.

,, కూని శెట్టి వెంకటరత్నము శ్రేష్ఠిగారి కుమారుడు వెంకట సోబయ్య శ్రేష్ఠిగారు.

,, మైలవరపు వెంకటప్పయ్య శ్రేష్ఠిగారి కుమారుడు సాంబయ్య శ్రేష్ఠిగారు.



# అర్పణము.

చ. ఇదివఱకొక్క గ్రంథము నింపుగ నర్పణజేసితిన్ భవ
త్పద సరసీరుహంబులకు ధన్యగతిన్ మదిఁగోరి, భక్తితో
నిదియును సంకితంబు నొనరింతు ద్వితీయ సుమంబుగా దయా
హృదయుఁడవై, గ్రహించి పరమేశ్వర! ప్రోవుము నన్ను నిచ్చలున్.

గ్రంథకర్త.




సాహిత్యలోకమున పూచిన పదమూడవపూవు యీధ్రువకుమార విజయము. ఇప్పటివఱకు వెలువడిన గద్య పద్యముల యం దధికసంఖ్య కల్పితములు. ఇది పౌరాణికము. భాషగ్రాంథిక మనవచ్చును. గ్రంథకర్త స్వతంత్రించి అవసరమగు మార్పులతో, నూతన మార్గమున కథను నడిపించెను. ఇది నవల యని చెప్పుటకు వీలులేకపోయినను, నవలలను జదువుట కలవాటుపడిన యీనాటి చదువరులకు విసుగుజనింపకుండునట్లు చిత్రింపబడినది.

ఈగ్రంథము విద్యాలయముల బఠనీయ మగునేని విద్యార్థులకు పలువిధముల నుపయోగ పడగలదు. పడమటిగాలికివాడి మలినపూరితములగుచున్న కోమలహృదయముల, దోహదము కల్పించి భక్తిబీజముల మొలకలెత్తించగలదు. ఇంకను కార్యాచరణకు గావలసిన పట్టుదల, ఆలోచన కవసరమగు పవిత్రత అలవడ జేయగలదు.

అస్మదాదులకిది సంతోషసమయము. మధురకవితావిలసితులై, సాహిత్యలతను పాలించుచు, కీర్తికాంత నేలుకొను

చున్న శ్రీ కర్లపాలెం కృష్ణరావుగారు జయలక్ష్మిని చేపట్టిరి. ఈ పవిత్ర పరిణయ మహోత్సవ జ్ఞాపకార్థము, త్వరలో, నొక యనుబంధమును ముద్రింపించి, చందాదారుల కందజేయదలచితిమి. ఇది, కృష్ణరావుగారి సాహసము కొనియాడదగినది. ధిక్కారము సన్మార్గమున నడచినప్పుడు మెప్పులందగలదు. ఈ సందర్భమున మిత్రులు వెంకట రంగారావుగారు, కృష్ణరావుగారిని గూర్చి వ్రాసిన పద్యమిది.

"తెనుగు సాహిత్యలతకు జీవనముపోసి
ఇసుకనేలను పూలు పూయించినావు
సాహసివిమున్నె-నేడు నీ సాహసమ్ము
అధికతరమయ్యె నూత్న కళ్యాణమునను"

విజయలక్ష్మీ విరాజితులగు కృష్ణరావుగారిని భగవంతుడు రక్షించుగాక!

ముద్రణాలయమునందలి అనివార్యములగు కారణముల వలన యీ గ్రంథమును సకాలమున కందజేయజాలకపోతిమి. చందాదారులు మన్నించుదురుగాక! తెల్లకాగితము ధర విపరీతముగ పెరిగినది. తపాలాఖర్చు లధికమైనవి. గ్రంథమాలను నడుపుటే కష్టతరముగ నున్న యీ పరిస్థితులను గమనించి, చందాదారులు తా మివ్వవలసిన చందాలను వెంటనే పంపుదురుగాక!

సాహిత్యలత,
జూన్ 1937.

శ్రీరామశర్మ,
ఆనరరీ యెడిటరు.



# ధ్రువకుమార విజయము.



## మొదటి ప్రకరణము.

"శ్రీలోలా! సుజనపాలా! పూర్వజన్మకర్మఫల మెవ్వ రయిన ననుభవింపకఁ దప్పునుకదా! తొలిజన్మమున నేనొక సద్బ్రాహ్మణునికైనఁ దృప్తిగభోజనమిడి యుపచరింపలేదేమొ? "అయ్యా! దరిద్రుఁడను. ఆదరింపుఁ" డను బీదజనుల నిరాదరించితినేమొ? లేకున్న దుర్భరమైన యీగర్భ దారిద్ర్యమెట్లు నాకుఁగలుగును? ఏబాధనైన భరింపవచ్చునుగాని, దరిద్రబాధ భరింప నెవ్వరితరమౌను? దరిద్రుఁడెంతటి పండితుండైనను మూర్ఖుఁడేయగును. వానిని బంధువులు పాటింపరు. ఆప్తులాదరింపరు. ఎంతచతురుఁడైనను వానిమాటయే లెక్కసేయరు. మర్యాదయనునది మృగ్యము. సద్వంశజనితుఁడైనను గులహీనునివలెఁ బరిగణింపఁబడును. వాని జీవయాత్ర కంటకయుతమగు

కాలిబాటయే ! దారిద్ర్యము యావజ్జీవము కరము వేదనాకరము అట్టిదుస్సహ దారిద్ర్య పీడఁబడుటకంటె నొకపరి, దేహముఁ ద్యజించుట శ్రేయము. తిరస్కరణమువలన గౌరవమును; దుర్జన సాంగత్యమువలన శీలమును; దుష్పుత్రుని వలనఁ గులమును; దానహీనతవలన ధనమును, దారిద్ర్యమువలన జ్ఞానమును జెడును.

శ్రీకరా ! యీ భీకర దారిద్ర్య ముఖమునుండి విముఖునిఁ గావింపుము. ఆర్తులపైఁ బఱపిన కరుణాకటాక్ష వీక్షణము నాపైఁ గొంతత్రిప్పుము. పలుపట్టణములఁ దిరిగితినే ! ఒక్క కాసైనను దొఱకెనా ? నాపూర్వజన్మ దుష్కృత మీరీతి బాధింపుచుండ నేనేమి సేయఁగలను? ఏమి నాకీవెట్టి ? విధాత్ర లిఖితప్రకారమే లభించునుగాని, యంతకుమించి యొఱకాసైనను దొఱకునా ? కుండ బావియందు ముంచినను, సముద్రము నందు ముంచినను మితియెంతయో యంతియే యుదకము లభియించును. ఈదారిద్ర్యాంధకారము బాపుటకుఁ బరమేశ్వరుని చింతనమే దివ్యమైన వెలుగు.”—అనుచు నొకపాంథుఁడు దూరాగమనమువలనఁ గలిగిన బడలికచేత శ్రమనొందుచు వచ్చుచుండెను. అతఁడు ధరియించిన నీర్కావిధోవతివలనను, రుద్రాక్ష మాలికలచేతను, బ్రాహ్మణుఁడని చెప్పవచ్చును. అతని వచన రచనలవలన గర్భదరిద్రుఁడనియుఁ గనఁగొన వచ్చును. దారపుత్రుల పోషణార్థము ధనార్జనమునకై దూర

దేశముల కలుగుచుండెను. అప్పుడెంతయో ప్రొద్దెక్కఁకపోయినను గ్రీష్మకాలమగుటచేఁ బశ్చిమవాత ప్రభావమున కాఁగఁ జాలక వడివడిగ నడచి వచ్చుచుండెను. ఎదుటఁ జూపుమేర దూరమున నొకనగరముం గాంచి దానిం గూర్చి పోవుచుండెను.

అట్లాతఁడు పయనమొనరించి పురప్రవేశ మొనరించెను. మిక్కుటమగు దాహము వలన నొక బ్రాహ్మణ గృహమునకై నెమకుచుండెను. కొంతవడి కావిపుట్టముఁ దీర్చి ధోవతిఁగట్టి వేర్చి గుచ్చిన స్ఫటికమాల మెడధరించి, చెవుల రుద్రాక్షపోగులు చెంగలించుచుండఁగ గుమ్మమునం దటునిటుఁ దిరుగుచున్న శ్రోత్రియ బ్రాహ్మణుఁ డొక్కఁడు కాన్పించెను. మన పాంథుఁడా విప్రవరునిఁ గాంచి "అయ్యా! కొంచెము మంచి నీరిప్పించెదరా?" యని యడిగెను.

బ్రా—మీ దేయూరు?

పాం—సరయూతీరమున నొక పురము.

బ్రా—మీ పేరేమి?

పాం—మాధవశర్మ యందురు.

బ్రా—ఎచ్చటికి వెళ్లుచుంటిరి?

పాం—అయ్యా! తరువాత విషయము లన్నియు విశదముగ వివరించెదను దాహమువలన నాలుక పిడుచ గట్టుచున్నది ముందు మంచినీరము కొంచె మిప్పింపుఁడు.

బ్రా—అశ్లీ—(వెనుకకుఁజూచి) అమ్మాయీ! తులసీ! కొంచెము మంచినీరీ బ్రాహ్మణునకుఁ దెచ్చి యిమ్ము.

(అనఁగాఁ బండ్రెండేండ్లు వయసుగలిగిన బాలికయొక్కతె కంచుచెంబు నిండుగ మంచినీరముఁ గొనివచ్చి యాతని కొసఁగెను. అప్పుడాతఁడు సేదదీఱి యిట్లు ప్రశ్నించెను.)

"అయ్యా! తమనామధేయ మెద్ది?"

"మహేశ్వర శాస్త్రియందురు."

"ఈనగరమును పాలించు వారెవ్వరు?"

"ఉత్తానపాదుఁడను మహారాజు."

"ఓహో! ఆమహారాజులా! ఎచ్చటనో వింటిని జగద్విఖ్యాత యశస్కులు. పరమధార్మికులు. నావంటి యాశ్రితులపాలిటి కల్పవృక్షముగదా ఆమహారాజులు."

"(యాచనకై వచ్చినవాఁడని గ్రహించి) భూసురుఁడా! ఈదినము చక్రవర్తిగారికి సంతానోదయమయినది. అందువలన మహారాజులవారు పరమానంద భరితులై బ్రాహ్మణోత్తములకు సువర్ణదానము లీయ సమకట్టియుండిరి. నేనచ్చటికే వెళ్లఁబోవుచుండ మీరును గాన్పించితిరి. అచ్చటికి వచ్చెదరా?"

ఈమాట వినఁగా మాధవశర్మకు శ్రమయంతయు నశించెను.

"అయ్యా! అవశ్యమట్లే వచ్చెదను. దయసేయుఁడు."

# రెండవ ప్రకరణము.



పరమేశ్వరుని సృష్టి పలువిధములు. గంభీరాంభోనిధులు—అఖండభూభాగములు—భూరిపర్వతరాజములు—ఘోరకాంతారములు—దివ్య నదీనదములు—వివిధములగు ప్రాణికోటులు—ప్రాణికోటియందు సైతము భేదమున్నది. వృక్ష సమూహము, జంతు సంతానము, మానవ సంఘము, మానవుఁడు మానముఁగల వ్యక్తి. అట్టి మానవుఁడు సత్యము, సహనము, శౌర్యము, శుచిత్వము, త్యాగము, విరాగము, దయ, ధర్మము, మున్నగు సద్గుణములు గలిగి యుండవలయును. ఒకప్పుడు మానవులు తమ విధ్యుక్త ధర్మములవీడి యధర్మవర్తులై చరించుకతమ్మున లోకమందలి ధర్మమడుగంటును. అట్టియదనునఁ బదిలముగ ధర్మమునుద్ధరించి యధర్మ మణఁచివేయ నొక మహాత్ముఁ డుదయించును.

మన కథాకాలమునకుఁ బూర్వము ధారుణియంతయు ధర్మహీనమయ్యెను. అట్టియెడ నీశానుకళావిలాసుఁడైన, విధాతకు స్వాయంభువ మనువుదయించెను. స్వాయంభువుఁడు పెద్దవాఁడై సర్వత్రి ధర్మమును నాల్గు పాదముల నడపింపఁ జొచ్చెను. కొన్నినాళ్లకామనువు, మనోహర విలాసవతియగు శత

రూప యను సుందర కాంతను బరిణయమయ్యెను. అతనా దంపతు లనంత ప్రేమసాగరమున నోలలాడు చుండఁ గొంత కాలమునకు వారికిరువురకుఁ బ్రియ వ్రతుఁడు, నుత్తానపాదుఁడు నను కుమారులుద్భవించిరి. అందుత్తానపాదుఁడు దిన దిన ప్రవర్ధమానుఁడై, సింధురగంధర్వ రథాధిరోహణాది సర్వకళల నభ్యసించెను. కొంతకాలమున కాభూకాంతుఁడు కాంతాలలామలగు సునీతి సురుచి యను సుందర మందయానలను బెండిలియాడెను. వివాహానంతర మాభూపతి సతీద్వయముతో సౌఖ్యముల నొందుచుండెను. కొన్నాళ్లకు సునీతి గర్భవతియై యొక సుముహూర్తమున బాలభానుని భంగిఁ బ్రకాశించు బాలునొక్కనిఁగనెను. తొలికాన్పున సూనుఁ డుదయించుట ధరణీకాంతుల కెంతయో సంతస మొదవించు విషయము. అందును జ్యేష్ఠభార్య గర్భమున నొకయర్భకుఁ డుద్భవించుటఁ దలంప వారి యానందమునకు మేరయే యుండదు.

ఆనాఁడుత్తానపాదునకుఁ బుత్రోదయమయినది. అందుచే రాజు పరమానందహృదయుఁడై పుత్రోత్సవముఁ జేయఁ దలంచెను. సమీరుఁడీ సంతోషవార్తఁ గొంపోయి, తెలిపినాఁడోయనునట్లు, పరిసరగ్రామ భూసురులకెల్లను నీవార్త విశదమయ్యెను. వెంటనే విప్రవటులందఱు వింత వింత వేసముల ధరించి, స్ఫటిక రుద్రాక్షమాలలు గళమునఁదాల్చియుఁ గేలఁ గీలించియు శిష్యులకు వేదముం జెప్పుకొనుచు వచ్చుచుండిరి.

వార లెంతయో సంభావనార్జన కుతూహలాయత్త చిత్తులై వడి వడిగ రాజసభాభవమున కేగుదెంచుచుండిరి. వారివెనువెంటనే త్రొక్కికొనుచుఁ ద్రోచికొనుచు ఘోటకబ్రహ్మచారుల జట్టుకట్టి విశ్రాంతిగ సభాభవన వేదికలందుఁ గూరుచుండిన విప్రవరుల విఱుగఁద్రొక్కుచు ముందున కేగఁ దలంచెను. కాని రాజభటుల కరములందలి కఱకు లరవారులఁగాంచి వెఱగంది యచ్చటనే యాగవలసివచ్చెను. పదిగడియల ప్రొద్దెక్కుసరికి కొలువుకూటమంతయు విప్రోత్తముల వేదఘోషలచే నిండి, పొంగి, నింగిముట్టుచుండెను.

అంతఁ గొంతవడికి నవరత్నమయ కిరీటము ధరించి, స్వర్ణపీతాంబరములఁగట్టి యుత్తానపాదమహారాజు సువర్ణ నిష్కములచేనిండిన వెండి పళ్లెరము కరమున ధరియించి, వందిమాగధుల స్తోత్రములు, భూసురాశీర్వాద ఘోషములు సెలంగ, విలాసముగా సభాస్థలమున కేతెంచి, నిలువఁబడియుండిన జనసమూహమునకుఁ "కూరుచుండుఁ డ" ని చే సంజ్ఞ యొనరించి, సింహాసనాసీనుఁడయ్యెను. అప్పుడా భవనమంతయు నిశ్శబ్దముగానుండెను. కాని యచ్చటచ్చటఁ గలుగు గుసగుసలు మాత్రము బొత్తిగా సమసిపోలేదు. అంతనాధరణీకాంతుఁడవనీసురులఁ జేఱఁజీఱి, యొక్కొక్కరికి హేమదానము లిచ్చుచుండెను. బ్రాహ్మణోత్తము లందఱు దానములఁబరిగ్రహించి, రాజును దీవించి, నిజనివాసముల కేగుచుండిరి. మనమాధవ

శర్మ సయితము భూరిదానములగ్రహించి, ఘోరదారిద్ర్య తిమిరపటల పరివృత భూబిలమునుండి వెలువడిన వానిభంగిఁ బొంగుచు నాఁటితోఁ దన దారిద్ర్య విచ్ఛేదనమైనదని తలంచుచు, మహేశ్వరశాస్త్రికొక నమస్కారముగావించి సమారాధనమునఁ దృప్తిగ భుజించి నిజేచ్ఛం జనియెను.



## మూఁడవ ప్రకరణము.



పలువురు ప్రభువుల సేవించుట—పలువ్యాపారములు నమ్మియుండుట—పలువురు భార్యలఁ బరిణయమగుట—మున్నగునవి ప్రమాదకరములు. అందు ముఖ్యముగ భార్యాద్వయమును గట్టికొనినవాఁడు సుఖముగ జీవింపనేరఁడు. వాని బ్రతుకు బహు దుఃఖకరము. భార్యల తగవులఁ బరిష్కరింపఁ బూనుకొనుట దండధరునిపాలి కఱిగినట్లే. భార్యలపోరు బడలేకయే గాఁబోలు శివుఁడొక భార్యను శిరమునను, విష్ణువొక సతిని వక్షమునను నిలుపుకొనుట! పరమాత్ముఁడైన శ్రీకృష్ణుఁడు సైతము సత్యాదేవి సవతిపోరులు సవరింపనేరక చాల శ్రమపడెను. సవతిమాత్సర్యముననే కదా కైకేయి శ్రీరామచంద్రుని కానలకంపినది? ఇన్ని విషయము లాలోచింప నేచ్ఛ

టనోదప్ప సవతిపోరు తప్పక కలిగియే యుండును. అట్టియెడ భర్త, నెఱజాణయు, వాక్చాతురియు నగు భార్యపక్షమున లంభించియే తీరవలయును.

ఉత్తానపాదునకు నీయవస్థ తప్పినదికాదు. సునీతి సరళ. నిర్మలహృదయ. కాపట్యమెఱుఁగని కాంత. పతిసేవాసక్తమానస. ధర్మకలావిలాసవతి. సురుచి వాక్చాతురికలది. కుటిలమానస. ఈర్ష్యాళువు. ఎకసెక్కెపుడెగని సవతిమాత్సర్యముకలది. అందునను సునీతి ముందుగ నందనునిఁ గాంచుటయుఁ దానప్పుడే గర్భవతిగనుండుటయుఁ గాంచి, సురుచి మఱింత యసూయాస్వభావురాలయ్యెను. పతినిడాసినప్పుడెల్ల నిరసనము, నిష్ఠురసంభాషణము, నిరంతర వాగ్వివాదము మిక్కుటమయ్యెను. ఉత్తానపాదుఁ డుత్తముఁడే కాని సురుచియందలి వ్యామోహముచే గుణవతియగు సునీతిని వేఱొకసౌధమున నుంచి సంతతము రెండవభార్యయందే ప్రేమగలవాఁడై యామెయంతఃపురమునందే వసింపుచుండెను. ఇట్లు రెండువత్సరములు గడచెను.

సురుచి సౌధము నాల్గంతస్తులు గలిగి మనోహరముగ నుండెను. ప్రతియంతస్తును వేఱువేఱురంగులతో మెఱయుచు సౌందర్యముచే శోభిల్లుచుండెను. ఆభవనమునకుఁ బూర్వభాగముననొక సుందరమందిరము కలదు. ఆమందిరమునందంతటను బట్టుపుష్పములచేఁ గట్టఁబడిన తివాసీ పఱుపఁబడి యుండెను. ముత్యములుగూర్చిన త్రివర్ణ చిత్రపటములు గోడలకుఁ దగిలిం

సంబడి యుండెను. అందంమునివంపు నిలువుటద్దములు 'తళతళ' మెఱయుచుండెను. మందిర మధ్యభాగమున రాజదంపతులు గూరుచుండు రత్నసింహాసనముండెను. అది రాజదంపతులవిలాసమందిరము. ఆమందిరపు ముందరిభాగమునఁ గల పందిరిస్తంభములకు సుందర సుగంధ సుమభరితములైన తీవెలల్లుకొని యుండెను. అచ్చటికనతిదూరముననే పుష్పవనముకలదు. ఆవనమందు సకలకుసుమ జాతులును గలవు. సర్వకాలమేదో యొక వనలత పుష్పించి సుగంధ సూనముల నొసంగుచునే యుండును. కొన్నిలత లచ్చటచ్చట వృక్షములకల్లుకొని పొదరిండ్లవలెనుండెను. పలువిధములయిన ఫలవృక్షములుసైత మందుఁ గలవు. పండినగెలలచే నిండియుండు రంభాతరువులొకవంకను, లలిత దళరాజితములైన రసాలము లింకొకవైపునను, బరిపక్వ ఫలభారమున వంగిన పనస వృక్షములు మఱియొక దిశను, బచ్చనిపండ్లతో విఱిగిపోవుచున్న కమలాభూరుహములు వేఱొకచోటను, ఉండి, యావనమున కెంతయో వింత శోభఁగూర్చుచుండెను. ఆ వనమధ్యమున నొక లతావినిర్మిత కుటీరము కలదు. ఆ కుటీరమున కంటియే యొక యున్నత ప్రదేశము కలదు. ఆ ప్రదేశ మొక వృక్షమును జుట్టియుండి వేదికవలె నుండెను. ఆ వృక్షము పెనవైచుకొనిన ద్రాక్షతీవియ యొక్కటి కమ్మని ఫలములతో వ్రేలాడుచు నా వేదికయందుఁ గూరుచుండు వారల శిరములకుఁ దగులుచుండును.

అట్టి వనమున విహరించు కొఱకై రాజదంపతు లప్పుడప్పుడు విలాస మందిరమునకు వచ్చుచుందురు. ఆనాఁడు విహారార్థమై రాజును సురుచియు నచ్చటికి వచ్చియుండిరి. ఉత్తానపాదుఁడు కొన్ని పరిమళ ప్రసూనములఁ గోసి తనకోమలి కుటిలకుంతలములయందుఁ దురుముచుండెను. సురుచియుఁ బుష్పించిన సుమరాజములఁ గొన్నిఁటిఁ గోసి తెచ్చి దండ గుచ్చుచుండెను. అట్టియెడ సురుచి సుతుఁ డుత్తముఁడు సంతసమున నచ్చటికి వచ్చుచుండెను. సౌందర్యమంతగా నా బాలునిఁ జేకుఱకున్నను, విలువగల వస్త్రములు, భూషణములు గలిగి యుండుటచే నొకమాదిరి విలాసముగనే యుండెను. భూపాలుఁ డా బాలునెత్తుకొని ముద్దాడి తొడలపై నిడుకొని శిరోజముల సవరించుచుండెను. అంతలో సురుచి యచ్చటి కేఁగుదెంచి మల్లెపువ్వుల మాలయొక్కటి బాలుని మెడలో వైచి, మధుర ఫలములఁ జేతికి నిచ్చి, ముద్దిడికొని, ముఱియుచు, ముచ్చటలాడుచుండెను.

అట్టి సమయమున నైదేండ్ల బాలుఁడు, సునీతి సూనుఁడు ధ్రువుఁ డచ్చటికి వచ్చుచుండెను. సాధారణపు దుస్తుల ధరియించి యున్నను ఆ సుకుమారుని యంగసౌష్ఠవము తొంగిచూచుచునే యుండెను. సూర్యోదయమున వికసించు నీరేజమువలె నా బాలుని ముఖకమలము కడుంగడు ప్రకాశించుచుండెను. ఆ విశాల ఫాలభాగమున వినీలకోమలకుంతలములు

విహరించుచు, నొకవింత సోయగము జిమ్ముచుండెను. ఎత్తైన నాసికయు, రక్తరేఖావిభాసితములైన యా కర్ణాంతవిశాల విలోచనద్వయమును, మృదులములయిన పెదవులును, ముద్దుల మూటఁగట్టు చెక్కిళులును, బూర్ణేందు బింబమును విడంబించు నా బాలుని మోమున కెంతయో వన్నె బెట్టుచుండెను. ఆ బాలుని తనూవిలాసము వసంతసమయకుసుమ విలాసమును గేలిసేయుచు నసుటలో నతిశయోక్తి లేదు. వేయేల! యా బాలుని సర్వాంగములు సౌందర్యశోభితములై యొప్పారుచుండెను. సహజముగ నా బాలుఁడు రాజకుమార లక్షణయుక్తుఁడై రాజిల్లుచుండెను. ఎదుట రత్నసింహాసనాసీనుఁడై యున్న జనకునిఁ గాంచి హర్షించి, తానును దండ్రి యంకమెక్క నుబలాటపడెను.

నికుంజమున విహరించుచు హరిణముఁగాంచి చెంగునఁ జెంగలించునాఁడు సింగముభంగిఁ బఱచి సురుచి రోషకషాయితలోచనయై ధ్రువునిలాగివైచి "ఓరీ! ధ్రువా! ఎందునకీ దురాస. తండ్రి యంకమెక్క సాహసించెదవా? అట్టి యాస నీకీజన్మముననే లేదు. అట్టులయిన నా గర్భముననే జనించియుండవు. అదికాక నిర్భాగ్యురాలగు సునీతిగర్భమున జనించి రిత్తకోర్కెలు గోరిన నెట్లు ఫలించును. జంబుకము సింగము పాలి మాంసమునుగోరఁ జెల్లునా? నాతనయుఁడు రాజైయుండఁగా నీ వాతని సేవింపవలసినవాఁడవు.

క. ఈ సకల రాజ్యభోగ
శ్రీ సంపదచేత నుల్లసిల్లి ఘనుండై
నా సుతుఁడుఁగాక, యీ సిం
హాసన మెక్కంగ నీకు నర్హంబగునే.

క. అదిగాన నీవధోక్షజు
పదపద్మము లాశ్రయింపు పాయకహరి నా
యుదరమునఁ బుట్టనిచ్చును
వదలక యట్లయిన ముదము వఱలెడి నీకున్.

అందనిపండ్ల కాసపడకుము. పొమ్ము.

ఇట్లు దుర్భాషలాడి సురుచి యాబాలుని సౌధపుమెట్ల నుండి క్రిందికి గెంటివైచెను. రాజు దుర్భరకార్యముఁగాంచియు శిలావిగ్రహమువలెఁ గూరుచుండెను. ధ్రువకుమారుఁ డట్లు త్రోపువడి లేచునప్పటి కాతని కన్నులు మూఁతలు వడెను. మఱలఁ దెఱచునప్పటికి వానినుండి గంగాప్రవాహమువలెఁ గన్నీరు ధారగాఁ గారి పాదముల పర్యంతముఁ బ్రవహించెను. ఆతని నేత్రములు రక్తవర్ణము లయ్యెను. దుర్భరపరాభవానల కీలయొక్కటి యందుండి వెడలునట్లుండెను. "తండ్రీ!" యను నొక యవ్యక్తధ్వని తప్ప యాతఁడేమియు మాటాడలేదు. పాదములు తమంతటఁ దామే వచ్చిన మార్గముఁ బట్టుచుండెను. తల్లి గృహమును జేఱువఱకు ధ్రువుని హృదయపద్మమునఁ బరాభవానలజ్వాల ప్రజ్వరిల్లి దహింపుచునే యుండెను.

# నాల్గవ ప్రకరణము.



"కటకటా! నేనెంత మందభాగ్యురాలను. పతిసేవ కేనెంతయు దూరమైతినికదా! పడఁతికిఁ బతిసేవయే పైడి మూట. అదియే కల్పతరువు. అదియే జన్మసాఫల్యము. అయ్యది యే యిష్టార్థదాయిని. పతి పాదపద్మ పరిచర్యసేయు పాటల గంధి సురగరుడోరగ విద్యాధరాది కాంతలకంటె నధికురాలు. ఏ వనితామణి ప్రియుసేవా విహీనయగునో, యా వనజాక్షి సకల సద్గుణ ఖనియైనను, సౌందర్యనిధియైనను, బతివ్రతామణి యైనను, నిరర్థకయే యగును. తరుణికేకరణిఁ జెప్పినను బతి సేవనముకదా సంజీవకరణి అట్టిచో నాకీ జన్మమునఁ బ్రాణేశు పాదసేవఁజేయు భాగ్యమే లేదుకదా! అట్టి నా జీవితమేల? భర్త్రనురాగదూరయగు భామిని బ్రదికినను జచ్చిన నొక్క టియే. అయ్యో! దైవమ! భర్తృప్రణయ మనుభవించు భాగ్యము లేకున్నను జరణసేవఁ జేయుటకైన నోఁచనైతినే. పతినిఁ గలసి సతతము కేళికోద్యానముల విహరింపకున్నను, బ్రాణనాథు భవ్యసందర్శనమే మృగ్యమయ్యెనే—మణిమయ తారాహారాది మహనీయ శృంగార లాంఛనంబులు లేకున్నను బ్రాతఃకాల భర్తృపాదప్రణామమే కఱవయ్యెనే. వివిధభక్ష్య భోజ్యము లారగింపకున్నను, దద్భుక్తశేషోచ్ఛిష్టాన్నమైననుఁ

గుదుచు నాశయే లేదుకద? నా పూర్వపుణ్యవశమున నుత్త మోత్తముఁడగు నుత్తానపాద మహారా జంతవానినిఁ జెట్టఁబట్టితి నని సంతసించితినే. ననుఁబోలు ధన్యురాండ్రిలోకమున లేరని పొంగిపోయితినే. సంతతము భర్తృకైంకర్య భాగ్యము లభి యించెనని యాసపడితిని. ఎంతలో నా యాసలన్నియు నెండ మావు లయ్యెను? మహారాజపుత్రికనై, చక్రవర్తి పత్నినై, యెంతకన్నెఱుంగని శుద్ధాంతకాంతనై, పట్టపుదేవినైన నేను నుదతు దాసికిసైతము చుల్కనైతినికద! వారి విలాసమందిర విహారముల కేమయిన నంతరాయముఁ గల్గించితినా? సవతి మాత్సర్యమూని దానినిఁ బల్లెత్తు మాటనైనను బలికితినా? నా సోదరికన్న మిన్నగ భావించితినే. అట్టిచో నాకీ దుర్భర వియోగమేమి? సౌధాంతరవాసమేమి? భర్త్రనురాగదూర మేమి?

సురుచీ! నీ వెంతటి దుష్టమతివే? నీకింతటి ప్రబలమగు సవతి మాత్సర్యమేల? నా కుమారుని గన్నులారఁ గాంచి సహింపలేవుగద? మందిరాంతరవాసముఁ గల్పించితివి. ప్రాణేశుపజ్జఁ జేదితివి. నా ప్రణయమును బాడుచేసితివి. ఇంతకన్న నేమి చేయఁగలవు? ఏమిచేసెదవా—నేనిచ్చట భర్తృవి యోగమునఁ గుందుచుండ నీవచ్చట నతఃపురమునఁ గులుకు చుండెదవు. నా మానస మిచ్చట నిరంతరము దుఃఖముచే దహనమగుచుండ నీవట నానందపారవశ్యమున విలాసమందిర

మున విహరింపుచుండెదవు. నేనిటఁ గ్రిమికీటకాదులకన్న హీన ముగఁ బరిగణింపఁబడుచుండ నీవటఁ బట్టపుదేవివై పొంగిపడు చుందువు. అయ్యో! ఏల యీలీల సవతిని దూరుచుంటిని. ధర్మాధర్మ విచక్షణా దక్షుండగు, ధవుండే యిట్లుసలుపఁ బరుల నిందింపఁ బనియేమున్నది? ఇదియంతయు నా పూర్వజన్మ కర్మ ఫలము. అని యొక సౌధమున ధూళి గప్పియున్న చేలము ధరించి, సంస్కారహీనములగు శిరోజములు మేనిపైఁ బడు చుండ, మోము కాంతిరహితమైయుండ, సునీతి యొక యరు గుపైఁ గూరుచుండి, పొంగిపొంగి వచ్చుచున్న దుఃఖ మాపి కొనుచు మాటిమాటికి కేదియో తలంచుచుండెను.

సునీతికి ధ్రువుఁడే పంచప్రాణములు-ఆమె తనకుఁ గలి గిన దుఃఖమంతయు బాలునిఁగాంచి మఱచుచుండెను. అప్పు డామె తలంపునకుఁ గుమారుఁడు రాఁగాఁ "దండ్రీ! ధ్రువా!" యని పిలిచెను. అంతలో నామెకొక రోదనము వినఁబడెను. అదివిని భయమంది ద్వారముకడ కేగునరికి ప్రక్కలెగయ నేడ్చుచు మాటిమాటి 'కమ్మా' యనుచు ధ్రువకుమారుఁడు వచ్చుచుండెను. ఆ దృశ్యముంగాంచి సునీతి మఱింత భయ విహ్వలచిత్తయై ప్రచండవాతాహతిం గూలు వనలతవలె గూ లెను. ఆమె నేదదేఱునప్పటికి తనయుఁడు తన యందఁగూరు చుండి దుఃఖించుచుండెను. సునీతి కుమారునిఁ గాంచి పర్వదివ సంబులఁ దరంగపరంపరచే నింగిముట్టఁ [illegible]గివచ్చు పారా

వారంబు భంగి, నుప్పొంగి వచ్చుచున్న దుఃఖమాపికొని "నాయనా! ఎందులకిట్లు దుఃఖించెదవు? ఒరులేమనిరి? బాలురెవ్వరైనఁ గొట్టిరా? చెప్పుము" అని తనయునిఁ బ్రశ్నించెను.

ధ్రువుఁడు—ఇంకను దుఃఖించుచుండెను.

సునీతి—తండ్రీ! చెప్పుము. ఎన్నఁడురాని యింతదుఃఖము వచ్చినదేల? చెప్పుము. (అని కన్నీరు దుడుచును.)

ధ్రు—నే నీ దినమునఁ దండ్రిగారి యింటి కేగితినే...

సు—(అగ్రోక్తిలో) అయ్యో! తనయా! అచ్చటి కేల పోయితివి? నీ పినతల్లి యేమయినఁ గొట్టినదా? కన్న తండ్రీ! చెప్పుము.

ధ్రు—బాలురతో నాడుకొనుచు నూరక యే యచటి కేగితిని. పూలతోఁట దగ్గఱనున్న మందిరములో నాన్నగారును బిన్నమ్మయుఁ గూరుచుండి యుండిరి.

సు—అట్టి చోటి కేల పోయితివి? తరువాత నేమిజరిగినది?

ధ్రు—అప్పుడుత్తముఁడు తండ్రితొడలపై నుండెను. నేనును జనకుని యంకమెక్క నుంకించితిని.

సు—కుమారా! తృణముకన్న హీనముగ వారిచేఁ జూడఁబడు చుంటిమే అట్టిచోఁ దండ్రి నిన్నాదరించునా? ఆ... నేమి జరిగినది?

ధ్రు—అంతలోఁ బిన్నమ్మవచ్చి నన్ను నెంటివైచినది. ఆతోపుతోఁ గ్రిందఁబడితిని. అమ్మా! చూడుము. ఇక్కడ

నొప్పి తగిలినదే. (అని చూపును.) తగిలిన వ్రేలికే తగిలినట్లు సునీతి కీ పలుకులు నిశిత బాణములవలె మానసమున గ్రుచ్చుకొనెను. కన్నులనుండి 'జొట జొట' నీటి బిందువులు కారెను.

సు—తండ్రీ! ఎచ్చట నొప్పి తగిలినది? ఆ బాధచే నెంతకష్ట పడితివో నాయనా! ఈమున్నహ కార్యమునుగాంచియు నీ జనకుఁ డూరకుండెనా?

ధ్రు—ఊరకుండెను. ఒక్కమాటైన నాడలేదు. జనకుఁడు చూచుచునే యుండెను. మా పినతల్లి సురుచియాడిన మాటలు నాకెంతయో కష్టము గలిగించినవి. ఆ యువ మానసమున కొర్వఁజాలను. మాతా! నన్నేమి చేయ మందువు?

సు—పుత్రికా! ఏమి చేయుదువు—ప్రాణేశ్వరునిచే "ప్రియసీ" యని పిలిపించుకొన, నోఁచుకొనక పోయినను 'ఓసీ! దాసీ!' యని పిలిపించుకొనుటకుఁడగని నాగర్భమున జనించి యేమి చేయఁగలవు నాయనా! తొలిజన్మపాప ఫలమునకు బాధలుభరింప వలసియుండఁగఁ జింతించిన నేమి ప్రయోజనము? తనయా! ఆలోచింప నీ పినతల్లియాడిన పలుకులే శుభప్రదములని తోఁచుచున్నది. ఎట్లంటివేని:— "జనకునియుత్సంగ మెక్కఁదలఁచిన నిందిరా సుందరీ రమణ చరణ కమలములఁ గొలువు" మని కదా నుడివినది.

ధ్రు—ఔను అట్లే పలికినది.

సు—కావున సృష్టిస్థితిలయ లీలావినోదుఁడైన, యే త్రిలోలుని పావనపాదపంకజ పరిచర్య వలిపి భారతీనాథుఁడగు బ్రహ్మ, తన పదవినందెనో, మీ తాత స్వాయంభువ మనువు ధర్మస్థాపనమునకై యే పరాత్పరుని గూర్చి యజ్ఞ యాగాది క్రతువులొనరించి యైహికాముష్మిక సుఖములందెనో, యట్టి సర్వవ్యాపనశీలుని, సకలలోకవందితుని, సర్వయోగీంద్ర సంసేవితుని, శాశ్వతానంద సంధాయకుని సేవించి, సఫలీకృత మనోరథుండవుకమ్ము. నాయనా! అంతకంటె నీవు చేయఁగలుగునది లేదు.

ధ్రు—అమ్మా! ఆపరాత్పరుఁ డెచ్చటనుండును?

సు—సర్వవ్యాపన శీలుండని నుడివితినే తండ్రి! అంతట నిండియే యుండును.

ధ్రు—అట్లయిన నాకెట్టులు గనఁబడును?

సు—కాననంబుల కేగి, కమలాక్షుని గూర్చి ప్రార్థించినచో, నాజగత్పిత నీ ప్రార్థనమునకు మెచ్చి నీకు దర్శనమిచ్చును.

ధ్రు—అమ్మా! ఆమహానుభావుఁ డెట్టులుండును?

సు—పుత్రకా! ఆమహనీయుఁడు నీలమేఘశ్యాముఁడు—నీరజాక్షుఁడు. విశాలవక్షుఁడు—ఆజానుచతుర్బాహుఁ

మణిమయకోటీరుఁడు—మకరకుండల భూషణుఁడు—పీతాంబరుఁడు—కమలనాభుఁడు—మందారమాలాజాలతనూవిలాసుఁడు—నిరుపమతారాహారాలంకారుఁడు కౌస్తుభమణిభూషణుఁడు—శంఖచక్రగదా ఖడ్గశార్ఙ్గధరుఁడు— తెలిసినదా తండ్రీ! అట్టివాని నారాధింపుము.

ధ్రు—జననీ! ఆపగను పురుషుఁడు పూజించని వారినిఁ బ్రోచునా? ఇదివఱ కెవ్వరి నైనఁ గాపాడెనా?

సు—నాయనా! కాపాడ కేమి? ఆము గారి దీనులపాలిటి కల్పభూజము. గజరాజొక్కఁడు పూర్వము కాసారమున విహరింపఁబోయి మకరిచేఁ జిక్కి సంకటఁబడుచు మధుసూదనునిఁ బ్రార్థింపఁగా నాపరాత్పరుఁ డాతనిఁ బరిరక్షించెను.

దూర్వాసుఁ డొకప్పుడు దురాగ్రహాయత్తచిత్తుఁడై యంబరీషునిపై నస్త్రమును బ్రయోగింప, నాభక్తుఁడుఁ భగవానునిఁ బ్రార్థించి యస్త్రబాధఁ దొలఁగించుకొనెను. దుష్టదానవులు చెలరేగి దుండగములు సలుపుచు దేవేంద్రాదుల బాధింపుచుండ, వాఱలాయుము మలఁ బడలేక పరమేశ్వరునిఁ గూర్చి బహుదినములఁ గీర్తించిరి. వారిజాక్షుఁడు వాఱల మొఱలాలించి, వాం

ధితములఁ దీర్చి రక్షించెను. ఇట్లెందఱో యా సర్వే

శ్వరునిఁగూర్చి ప్రార్థించి, యిష్టసిద్ధిఁ బడసిరి.

ధ్రు—అమ్మా! అట్టులయిన నా పద్మాక్షుఁ గాంచు పర్యంత

మన్నమైనఁ దినను. దృఢసంకల్పుఁడనైతిని-నిశ్చయము

ముమ్మాటికి నిశ్చయము. ఇప్పుడే కానల కేగెదను.

సు—నాయనా! కానలన్న నాకేదియో భయము వొడము

చున్నది. తండ్రీ! వలదు. పోవలదు. నను వీడవలదు.

ధ్రు—తల్లీ! నీవెన్ని చెప్పిననుసరియే నా చేతము సమ్మతింపదు.

విపినముల కేగవలయును. కేశవునిం గీర్తింపవలయును.

మదభీష్టసిద్ధిఁ బడయవలయును. నీ కానందము గలిగిం

పవలయును. పరాభవానలకీలఁ జల్లార్పవలయును. చిర

కీర్తి గడింపవలయును. ఇది నా సంకల్పము. వృక్షముపై

కెగబ్రాకు లతను దెంపకుము-సర్వేశ్వరుఁడే కలఁడు.



# ఐదవ ప్రకరణము.



భానుఁడపరవార్ధిలోఁ గ్రుంకినది మొదలు తనధవళసాం

ద్రచంద్రికలు వెల్లివిరియ నిచ్చలవిడి ప్రకాశింపఁ జేసిన కుముద

కాంతుఁడు కళావిహీనుఁడుగాఁ బోవుచుండెను. కాంతుని కళా

హీనతకుఁ గళవళమొంది కాఁబోలు కుముదకాంత సైతము

కాంతిహీనయయ్యెను. జారుఁడగు రేఱేఁడెక్కడ తమపాతివ్రత్య భంగమొసరించునో యని భయముంది, ముకుళించియున్న కాసారాంతర్గత కమలములు వికసింపఁ జొచ్చెను. ప్రాగ్దిశా కాంత, యరుణచేలమును గట్టిలోకబాంధవారాధనమున కెదురు చూచుచుండెను. "ప్రపంచము మాయామయము. జీవనము బుద్బుదప్రాయము. సంసార మంధకారకూపము. విషయవాంఛలు గగనకుసుమములు. దేహములు శాశ్వతములు కావు కావ"ని కాకములు కూయఁ గడఁగెను. శకుంతసంతానము లప్పుడే తమ మధుర సంభాషణల నాపి కొలఁకుల నేరితినుటకై యెందో యేగుచుండెను. ప్రభాతవాతము సుగంధములఁ గొని దూరముగ నేగుచుండెను.

అట్టియెడ నెవ్వని మంగళ తేజో మహిమంబుచే సకలము వికాసము నొందుచున్నదో, యెవ్వనిచే నిఖిల భూత జీవనాధారంబగు నదనదీతరులతా వ్రాతము పోషితమగుచున్నదో యెవ్వని యమృత కిరణ ప్రసారముచే భూరి భువన మారోగ్యవంతమగుచున్నదో, యెవ్వని దివ్య సందర్శనమున నిఖిల కలుషము లడఁగునో, యట్టి సకల చరాచరకోటి సంరక్షణ శీలుండగు సూర్యభగవానుఁ డుదయించెను. అప్పు డా తరణి కిరణవారపు టరుణకాంతి లేఁతయాకులపైఁ బ్రసరించి యెంతయో మనోజ్ఞముగా నుండెను. కొన్నిపర్ణముల యందలి తుషారకణములు లే యెండసోకి ముత్యములవలె మెఱయు

చుండెను. వల్మీకముల యందున్న దర్వీకర రాజములు సలిపి బాంధవునకు నమస్కరించి నృత్యములు సలుపుచుండెను.

ధ్రువకుమారుఁ డప్పటికి పట్టణము వీడి మైదాను క్రోసులు వచ్చెను. ఇంక నరణ్యము కొంచెము దూరమునఁ గలదు. ధ్రువకుమారవిజయము సూచించుటకో యనఁ గోకిల యొకటి తన మధుర గానమున రసముజ్జీవింపఁ జేసి కంఠ మెత్తి యొక మంగళగీతమును బాడెను. శారికాకీరములు చెంగుచెంగున దాటుచు నెడమనుండి కుడికి నేగుచుండెను. అప్పుడే వికసించిన కుసుమములఁ గొని కొందఱు మందయానలు మందగమనమున నెదురు వచ్చుచుండిరి. గోపాలురు దధిక్షీర భాండముల శిరములపై ధరియించి నగరముల విక్రయింప నేగుచుండిరి.

ధ్రువకుమారుఁ డా ప్రదేశము నధిమించి ఘోరారణ్యముల మధ్యమున కేగుచుండెను. పంచవత్సరముల బాలుఁడు విరాగియయ్యెను. పరిభవమును భరింప లేకపోయెను. సాహసమూనెను. తపసిగాఁ దలఁచెను. పినతల్లి యాడిన మాటలు కర్ణపుటంబులఁ బ్రతిధ్వనించుచుండెను. ప్రజ్వరిల్లిన పరాభవానలము దేహమంతయు దహించుచుండెను. భీకర కాననమధ్యమున కేగెను. చెట్టుదట్టముగఁ బెఱిగి మార్గమును సైతము మాయము గావించుచుండెను. నల్లనై నిగ్గులుదేరిన పాషాణచయము మచ్చ టచ్చట భయదమై పొడగట్టుచుండెను. ఇంకను

ధ్రువుఁడు ముందునకేగుచుఁ గరిహర్యృక్షాది క్రూరసత్త్వ సంయుత కాంతారాంతరమునఁ బ్రవేశించెను. అటవీమృగముల భీషణఘోషణములు ఘోరముగనుండెను. క్రూరసర్పము లందంద 'బుస్సు' మనుచుఁ బోవుచుండెను. అరణ్యమంతయు నంధకార బంధురమయ్యెను. అయినను ధ్రువుఁడు చలింపలేదు. ధైర్యము విడలేదు. పట్టుదలఁ బాయలేదు.

అంతలో నాబాలున కాగహనాంతరమున నొక వెలుఁగు కాన్పించి నట్టుండెను. అతఁడట్లే నిలువఁబడెను. దివ్య విమానారూఢులై సప్తర్షులు కాన్పించిరి. భక్తితత్త్వమును గన్పఱచిరి. విజయసూచకాశీర్వచనములఁ జేసిరి. అంతర్ధానమొందిరి. ధ్రువుని జ్ఞానకమలము వికసించెను. అతఁడా దృశ్యమును గాంచి నివ్వెఱవోయెను. అట్లే నడచుచుండెను.

అప్పుడొక వీణానినాద మాతని వీనులఁబడియెను. ఆనినాద మెంతయు మధురతమముగానుండెను. మఱలనొకపరి నాదివ్యనాదము వినఁబడెను. దగ్గఱిల్లు నట్టుండెను. ధ్రువుఁడటు నిటు చూచుచు నచ్చటనే యొకరాతిపై నాసీనుఁడయ్యెను.

భక్తకుసుమము—విరించి మానసరత్నము,—సకలలోకసంచారి, సదా సర్వేశ్వర చింతారతుఁడు, నారద భక్తాగ్రణి, గగనమునుండి దిగివచ్చి యెదుటఁ బ్రత్యక్షమయ్యెను. వాని యనుభావము మనమున నుదయింప ధ్రువుఁ డెదురు వచ్చి సాష్టాంగ నమస్కారము గావించెను. నారదుఁ డానందమొంది

బాలుని లేవనెత్తి మస్తకమున హస్తముంచి యాశీర్వదించెను. "మహాత్మా! తమ దర్శనముచే సంతోష తరంగిత స్వాంతుండనైతిని. నన్నుద్ధరించుటకేతెంచిన మీరలెవ్వరో యానతీయుఁ" డని ధ్రువుఁడు ప్రార్థించెను.

నారదుఁడు—బాలకా! నేను నారదుఁడను యోగదృష్టిచే నీ చరిత్ర మంతయుఁ గనుగొంటిని. ఇపుడు నీ వార్తరక్షామణి యొద్దకే గదా పోవుచున్నది?

ధ్రు—మునీంద్రా! అగును. నా పినతల్లి కావించియుండిన పరాభవము భరింపలేక వనముల కేగి వనమాలినిం బ్రార్థింప నేగుచుంటిని.

నా—కుమారా! బాలుఁడవు అముదేంల్లవాఁడవు రాజకుమారుఁడవు-సుకుమారుఁడవు-ఆటలాడెడువాఁడవు-అట్టివాఁడవు ఘోరాటవుల కేగి తపమాచరింపఁగలవా?

ధ్రు—ఋషిచంద్రమా! "పినతల్లి వాక్యములను శల్యములచే గ్రుచ్చఁబడిన నీ హృదయవేదనము శ్రీమన్నారాయణుని చరణకమలము లాశ్రయించి నివారించుకొ"మ్మని నా జననియే నుడివినది అందులకై యిట్లేగుచుంటిని.

నా—బాలకా! నీవు చెప్పినది నిక్కమైన విషయమే కాని యొక్కటి యాలకింపుము.

కం. విను పుత్త్రక! బాలుఁడవై
యనయంబును గ్రీడలందు నాసక్తమనం
బునఁ దిరిగెడు నిక్కాలం
బున నీ కవమానమానములు లేవెందున్.

అది యట్టులుండ

కం. నీ వెక్కడ తప మెక్కడ
భావిశుభశ్రీదమైన ఫలమెక్కడ నీ
వీ వెఱ్ఱిపడుచు బుద్ధులు
పోవిడువుము వేగమగిడిపొమ్ము కుమారా!

స్వతంత్రించి యాడిన నీ పినతల్లి మాటలు సరకుసే
యక సదనంబున కేగుము. నామాట వినుము.

ధ్రు—నారదమహానీంద్రా! స్వతంత్రించి యాడిన మాటలు
కావవి. నిష్ఠురవచనములు-ప్రేమశూన్యములు-కాప
ట్యపూరితములు- మాత్సర్యయుతములు-విషతుల్యము
లు-అట్టి మాటలా, పాటింపకుండుట! మహాత్మా! సురు
చియాడిన మాటలు వాడి బాణములవలె నా హృద
యమున గ్రుచ్చుకొన్నవి. మేనవిఱిగిన శరములఁ
బెరుకవచ్చును గాని నిష్ఠురమున మనమున నాఁటిన
మాటలు వెడలింప వచ్చునా? భగవన్నామామృత
పానము గావించినఁగాని నా మనోవ్యధతీరదు. కావున
దేవా! సర్వేశ్వరారాధన విధానము నా కెఱిఁగింపుఁడు.

నా—బాలకా! ఏలయీలీల పలికెదవు? సర్వకాలము ఘోర తపమాచరించు సంయమీంద్రులు సైతము, ఆకమలా మనోహరు కటాక్షవీక్షణపాత్రులు గానేరక గాసినొందుచున్నవారలు. కాననమునఁ గాయకసురుల్ను, కంద మూలములు భక్షించి గాఢ తప మాచరింపఁగలవా? భీకరారణ్యము-భయంకరమృగములు-భీతినొందఁగలవు నీ ప్రియాన్నము దుర్లభము. నా వెంటరమ్ము. మీతల్లి యొద్ద పదలెదను. ఎదురువాదము లాడకుము.

ధ్రు—ఋషివరేణ్యా! ఎందులకిట్టులాడెదరు. పరమమునీంద్రులు-భక్తశిఖామణులు-భగవద్ధ్యానానందమయులు-మహానుభావులు-త్రిలోకగమనులు-సర్వజ్ఞులు-మీరలిట్టులాడుచుంటిరా? లేక నేనే భ్రమనొందుచుంటినా? స్వామీ! నామానసోత్సాహము వ్యర్థము గావింపకుఁడు. దుర్భరపరీక్ష సల్పకుఁడు. రక్షింపుడు. తమ సందర్శనానంద భాగ్యమున నాసంకల్ప మెంతయో దృఢపడినది. నన్నుని సందర్శనము సకలార్థసాధనము నన్నుద్ధరించు భారము మీయది. బాలుఁడను. జ్ఞానశూన్యుడను. తమ కరుణావలోకనము వాంఛించువాఁడను. కావున మునిపుంగవా! భవదీయ కృపారసము నాపైఁ జిలుకుఁడు. (సాష్టాగపడును.)

సర్వాంగాలింగిత భూతలప్రణాముఁడై యున్న బాలుని లేవనెత్తి నారదుఁడు "ధ్రువా! నీ సాహసమునకు సంతసించితి. నీ సంకల్పమీడేరును. భగవదారాధన మెఱింగించెదను. రమ్ము" అని యొక వృక్షముచెంతకుఁ గొంపోయి వీణియందుకొని శ్రుతులుసవరించి తాను రచించిన భక్తిగీతమును బాడఁగడఁగెను. నారద కంఠనాదము విపంచీనాదమునందు విలీనమగుచుండెను. భక్తిపారవశ్యమున నారదుఁ డొడలు మఱచెను. ఆవీణానినాదవిలోలుఁడై గాన సుధామధురరసాస్వాదనము గావింపుచు ధ్రువకుమారుఁడు చెంతనే కూర్చుండెను.

ఆహా! ఆమధురగాన ప్రభావమేమని చెప్పవచ్చును. పరిసరపాషాణ చయములు ద్రవించి సెలయేఱులవలెఁ బ్రవహింపఁ జొచ్చెను. సర్వగీర్వాణ గంధర్వసందోహము విమానారూఢమై వినువీధినుండి మధురమై, మోహనమై, నవరసభరితమై, విలసిల్లు నారద గానము వినుచుండెను. అప్పుడే కుబుసంబులూడ్చి వచ్చిన కృష్ణసర్పంబులు మధురమగు నాగాన నానుచు తమ ఫణముల నెత్తి నాట్య మొనరింపుచుండెను. ఫల వృక్షముల యందలి తీయని పండ్లను మెక్కి మెక్కి, మిక్కుటమగు నానందముతోఁ బక్షిగణమొక్కచోఁజేరి పరిపరివిధములఁ గిలకిలారావము లొనరింపుచుండెను. కంఠీరవముల కడనుండి కరీంద్రములును, శార్దూలముల చెంతనున్న హరిణగణము, చెలిలాటలాడుచు నాగానామృతపానముఁ గావింపుచుం

డెను. ఔరా! నారదుని గానకలాప్రావీణ్య మెంతునుం గానము. ఆ గాన సుధాసారమే గద సకల తత్త్వముల సహజవిరోధములు సమయింపఁ జేసినది. అదియే చరాచరముల కమితానందమును గలిగించినది.

ఆ భక్తిపూరిత గాన పీయూషమును గ్రోలుటవలన ధ్రువుని జ్ఞానాంబుజము నవనవోన్మేషమయ్యెను. నారదుఁడు గానము నాపి "బాలకా! భక్తివలనఁగాని భగవానుఁడు కరుణింపఁడు. కావుననేకదా కమలాక్షునకు "భక్తసులభుఁ" డను బిరుదనామము కల్గినది. భక్తిలేక వేయేండ్లు తపము గావించినను నిష్ఫలము. భక్తిమార్గమే, త్రైలోక్యపావనము." అనియెను.

ధ్రు—మునివరా! భక్తి యనఁగా నేమి? అదెట్లు లలవడును?

నా—నాయనా! చెప్పెదను వినుము. ఎవ్వని లీలావినోదముచే

సకల భువనముల సృష్టి స్థితి లయములు సాగుచున్నవో యెవ్వని యనంత మహిమాతిశయంబున సూర్యచంద్రాదులు సతతము గతులు దప్పక ప్రకాశించుచుండిరో, యెవ్వఁ డాకార చేష్టారహితుఁడై వెలుఁగొందుచుండునో, యెవ్వఁ డనంత కల్యాణగుణగణ శోభితుండై చెన్నొందుచుండునో, యెవ్వఁడు సర్వవస్తు పరిపూర్ణుఁడై రాజిల్లుచుండునో, యాతఁడు భగవచ్ఛబ్దవాచ్యుఁడు. తెలిసినదా, కుమారా! వినుచుందుము.

అట్టి భగవానుని యందలి యెడతెగని మనోజనితమైన విశ్వాసమే భక్తి. మఱియు నిర్మలినమై, యదృష్టోఫల ఫిపలన ననంతమై, నెలకొనిన యకృత్రిమ స్నేహపరిపాకమును భక్తియే-సేవకుని యందలి ప్రేమము దయ-స్నేహితుని యందలి ప్రేమము మైత్రి-భగవానుని యందలి యెడతెగని ప్రేమయే భక్తి-కులసతి యాత్మపతినిం బొందును. నదిసాగరమును గమించును. లతావితతి, క్షితిరుహము నాశ్రయించును. ఇట్టులే సాజముగ భక్తుడు సర్వేశ్వరుని పాదద్వంద్వమున మనస్సు నిలుపును. భక్తియన బోధపడినదా ధ్రువా ?

ధ్రు—మహాత్మా ! చక్కఁగ బోధపడినది. హర్షచిత్తుఁడనైతిని.

నా—బాలకా ! ఇఁకను జెప్పెదను వినుము. స్వర్గాద్యుపభోగముల నిచ్చు క్రతువులు, ప్రతిష్ఠాభోగభాగ్యముల నొసంగు సత్యయశోవిద్యలు, మాతాపితులు, రాజోపాధ్యాయాది గురుస్వరూపములు, తత్ప్రతిబింబములు. అనఁగా భగవదంశలు-అట్టివారియందును భక్తి బాటించుట భగవంతుని భావించినట్టులే యగును.

ధ్రు—స్వామీ ! భక్తిభావము విని పరమానంద భరితుఁడనైతిని. ఇఁక భక్తుని లక్షణములు సెలవీయ వేఁడెదను

నా—వినుము. అట్టి భక్తి పరతంత్రుఁడు భక్తుఁడు నాబరగు అతఁడు పుణ్యకార్యముల యందభిలాష కలిగి యుండును. మహాజనుల సేవనము నందాసక్తి కలిగి యుండును. అతఁడు రామాయణ భారత భాగవతాది పావన గ్రంథపఠనమువలన ప్రాప్తించిన పరిజ్ఞానము చేతఁ, బరస్త్రీ, పరధన, పరద్రోహము పరమార్థమని భావించి యతికాంతధర్ములై దుర్గుణములైన రావణ సుయోధన కంసాది జీవితముల నవలోకించి, యథాన్యాయముగ విమర్శనము జేయును. చంచలాలతి కల చందనమున నత్యంత చంచలములైన యైహిక, దైహిక, విషయములందు వైఖ్యమును జెందును. పునర్జనన మరణము లనెడి క్లిష్టయాతనలనుండి తరించు నుపాయము నెమకుచుండును. దార పుత్ర ధన కనక వస్తు స్నేహమును బరిత్యజించును. సర్వవ్యాపనశీలుండును, సృష్టిస్థితి లయ సలీలుండును, శ్రీలోలుండు నగు సర్వేశ్వరునియందుఁ దానాచరించు సర్వకార్యములు సమర్పణముఁ జేయును. పరమార్థమునకై తాను జీవించును. స్వార్థత్యాగియై యానందించును. అట్టి భక్తజనుల సాంగత్యమున భక్తియలవడును–కాని పైకి మాత్ర ముత్తమ భక్తునివలె నటించుచు దుష్కార్యము లాచరించు కైతవ భక్తుని స్నేహమును సజ్జనుఁడు కోర కుండవలయును.

ధ్రు—ఋషీశ్వరా! అట్టి కైతవ భక్తునిఁ గనుఁగొనుటెట్టులు?

నా—ధ్రువకుమారా! పరిమళమును బట్టి సుగంధ సుందర చందన తరురాజమును గుర్తింపలేవా? పరిపక్వ ఫలమును గాంచి పాదపప్రకృతిఁ దెలియఁజాలవా? పరిశీలనవలన దుర్జన సజ్జన సాంకేతిక మరయుట కష్టతరమా? అట్టిచో సాధుసంగమమే సర్వార్థదాయకము. నీపూర్వజన్మకృత సుకృతఫలమున నీకు భక్తియలవడినది. కావున భక్తిమార్గమున దపము గావింపుము.

ధ్రు—సంయమిపుంగవా! తపమనఁగా నెట్టిది? దాని ఫలితమేమి?

నా—తపమన, నొకపదార్థమును గూర్చి సుస్థిర చిత్తమున ధ్యానించుట-అట్టి తపమువలనఁ జేయ శక్యము గానిదియును, దాఁట సాధ్యము గానిదియును, పొంద నలవి కానిదియును, నడవ దుర్లభమయినదియు లేదు. సామాన్యజనులు పొంద నశక్యమైన దీ తపము-ఈతపంబు వలన మహాసీయు లెందఱో శాశ్వతానందపదవి నందిరి. సత్పురుషులు సర్వకాలము తపోనిష్ఠఁ గడపి యత్యున్నతమైన పదవి నొందిరి. సనకసనందనాదులును ఘోరతపమాచరించి, సర్వేశ్వర సాయుజ్యమును బడసి సం

తతానందపయోధి తరంగ మాలికాడోలికలలో నోల లాడుచుండిరి. అస్మదాదులైన మునులు సైతము తపోనిష్ఠం జేసియే సర్వసిద్ధులం బడసిరి.

ధ్రు—సంయమిలోకేశ్వరా! ధన్యుఁడనైతిని. తమ జ్ఞానవాకృతము సోకినంత నాయజ్ఞాన మేఘములు దూదిపింజ లవలెం దొలఁగిపోయినవి. మహారణ్య మధ్యమునం గల చందన వృక్షగంధము సోకి, పరిసర పాదపములు బహుళపరిమళ మిళితములై భాసిల్లునట్లు, తమ సందర్శనమున నాయాత్మ జ్ఞానయుతమై ప్రకాశించుచున్నది. ఇంక నాకమలామనోహరుని కైంకర్య విధానము సెలవీయుఁడు.

నా—కుమారా! అటులైనం బరాకులేక వినుము. ఇచ్చటికి కనతిదూరముననే యమునాతరంగిణి కలదు. ఆ నదీతీరమున మధువనము గలదు. ఆ ప్రదేశ మెంతయు హరిపార్థనమునకుం దగిన నెలవు. అచ్చటికేగి యా యమునా నదీతోయములం గ్రుంకులిడి శుచివై నిత్యమును నియమానుసరణి నీరజాక్షునిం బూజింపుము. బాలుఁడవు. వేదాధ్యయనాది కర్మల కర్హుఁడవు కానేరవు. నీకుం దగినట్లు కుశాజినంబులం గల్పించుకొని, యైహిక వాంఛలు బరిహరించి, స్థిరచిత్తమున సర్వలక్షణ లక్షితుండైన పరాత్పరుని గీర్తింపుము. సప్త

వాసరంబులు పఠింప సకలార్థ సిద్ధిఁ గలిగించు దివ్య మంత్రరాజము. బాలకా! దగ్గఱకు రమ్ము. (అని ద్వాదశాక్షర మంత్ర ముపదేశించి) తెలిసినదా? దానిని జపింపుము. ఒక దివ్య స్థలమున గూరుచుండి సుందరాకారుండైన దేవదేవునిం బ్రార్థింపుము.

సీ. దూర్వాంకురంబుల దూర్వాంకురశ్యాము
జలజంబులను జారు జలజనయనుఁ
దులసీదళంబులఁ దులసికాదాముని
మాల్యంబులను సుమైర్మల్యచరితుఁ
బత్త్రంబులను బక్షిపత్త్రుని గడు వన్య
మూలంబులను నాదిమూలఘనుని
నంచిత భూర్జత్వగాది నిర్మిత వివి
ధాంబరంబులను బీతాంబరునిని

తే. గీ. దనరు భక్తిని మృచ్ఛిలాదారురచిత
రూపముల యందుఁగాని రూఢమైన
సలిలముల యందుఁగాని స్థలము లందుఁ
గాని పూజింపవలయును గమలనాభు.

ధ్రువా! వ్యర్థపు టర్థముల నర్థించి ప్రార్థన కాలమును వ్యర్థపఱుపకుము. నీవర్థించు నర్థము సర్వార్థదాయకుఁ డగు పరమేశ్వరునకుఁ దెలియును. నీ డెందమున నమం

దానందమున గోవిందుని గూర్చి, "పరమాత్మా! నీపాదసేవఁ గలిగింపుము. నీ నిర్మల నామము జపించు భాగ్యము నాకుఁ బ్రసాదింపుము. నీ దివ్యమంగళా కార మొక్కసారి గనుపింపఁ జేయుము." అని ప్రార్థింపుము. నీ పూజాఫలమా పుండరీకాక్షునకు సమర్పింపుము. ఇట్టుల మనోవాక్కాయ కర్మంబులచేత మాధవు పాదము లాశ్రయింపుము. నాయనా! గోవిందుఁడు కోరిన వారికోర్కె లీడేర్చువాఁడు. శాశ్వతానంద పదవినందుము. శుభమగుఁగాక పోయివచ్చెదను. (అని యదృశ్యుఁడగును.)

ధ్రువుఁడు నారద వచనామృతమును గ్రోలి మధుమధువనదర్శనోత్సాహియై మార్గమును బట్టెను.



## ఆఱవప్రకరణము.



నిర్మల జలపూరితమై యమునానది ప్రశాంతముగఁ బ్రవహించుచుండెను. తాను గంగం గలియఁబోవుచుంటిననునానందమోయన నానదియం దప్పుడప్పుడు తరంగ మొక్కటి మాత్రము లేచి తటములఁ జేరుచుండెను. నలినీబాంధవు కిరణము లా విమలజలములందు సోకి, 'తళతళ' మని మెఱయు

చుండెను. నిలువుటద్దములలోఁ బ్రకాశించు నీడలట్లు, తీరము లందలి తరురాజములు నదియందుఁ బ్రతిఫలించుచుండెను. ఆ వృక్షములనుండి రాలిన ప్రసూనములు బారులు దీరి ప్రవహించుచుండ యమునాదేవి గంగాదేవికి కానుకగాఁ గొనిపోవు కుసుమమాలలవలెఁ గన్పట్టుచుండెను.

ఆ నదీతీర భాగము కొంతవఱకు మహాటవి. అట్టి కాంతారమే యొక్కచోటఁ శృంగారవనముగ నేర్పడినది. అదియే మధువనము. పూర్వమచ్చట మధువను దానవుఁడు మాధవారాధనముఁ గావించి ప్రత్యక్షముఁ జేసికొనెనఁట. తాను తపముఁ గావించిన యీ వనమందే సకల దేవగణసేవితుఁడై యిందిరారమణుఁడు వాసముఁ గావించునట్లు మధువు వరము వేఁడెనఁట. అందులకు సమ్మతించి శ్రీకాంతుఁడు కొంతకాలమట వసించెనఁట. మధువుచేఁ దపము గావింపఁబడిన వనమే "మధువన"మని పురాణములు చెప్పుచున్నవి.

ఆయారామ రామణీయక మెంతయు మనోహరము. అది మధుర ఫలవృక్షభరితము. చూతమాతులుంగములును, కదళీకపిత్థములును, బదరీభల్లాతములును, ఫలభరితములై పరిఢవిల్లుచుండెను. తాలతమాలహింతాలములు దట్టముగాఁ బెరిగియుండెను. కదంబకరవీర ఖర్జూరతరువులొండొంటిఁ బెనవైచుకొని పెరిగియుండెను. గొజ్జఁగ హిజ్జల వృక్షములు

పుష్పించి శోభించుచుండెను. నింబ జంబు జంబీరములు గుంపులు గుంపులుగఁ బెఱిగి చల్లని నీడలొసఁగుచుండెను. ఆకసమునంటు నాశతోఁ బెఱిగిన పున్నాగ వృక్షముల నుండి పూవులు జలజల రాలుచు నమరులు సుమవర్షములు గురిపించునట్లుండెను. అందందుఁ గల చందన మహీరుహ సందోహములనుండి మందమలయానిలయుఁడు సుగంధములఁ గొనివచ్చి యానంద మొందించుచుండెను. లభించిన వృక్షములనెల్ల నల్లిబిల్లిగ నల్లుకొనిన మల్లికామాలతీలతలు తమ వికసితనవ్యప్రసూన పరిమళముల వెదఁజల్లుచుండెను. మాధవీలత వంజుల భూరుహమున కల్లుకొని మంజులమయిన మొగ్గదొడిగి మనోజ్ఞముగా నుండెను. అచ్చటచ్చటఁ గల నికుంజపుంజముల రంజిల్లు కుసుమ గుచ్ఛంబులు విచ్చలవిడిగా వికసించి యుండెను. కొన్ని కోమల లత లెత్తుగాఁ బెరిగిన బూరుగుభూజములఁ బెనవైచుకొని డోలికలవలె నుండెను. అప్పుడప్పుడు సమీరకుమారుని తాఁకుడులకా లతాడోలికలు చలించుచుఁ దమ పరిమళమిళిత ప్రసూనరాజములఁ గోలుపోవుచుండెను. కొన్ని వనచరములా తీగె టుయ్యాలలపై నెక్కి యూయల నూగుచుండెను. శారికలొక్కచోఁ గూరుచుండి శ్రావ్యనాదము లొనరించుచుండెను. చిలుకలు ఫలవృక్షములపై నెక్కి మధురఫలములను ముక్కులతోఁ బొడిచి విడువఁగా, వాని చుంచువుల కాటువలన నాపండ్లయందు రంధ్రము లేర్పడి,

యందుండి రసమొక్క చిన్న సెలయేరువలె సాలముల మ్రా
కులపైఁ బ్రవహించుచుండెను. చివురుటాకుల మెక్కియు,
స్వాదుఫలముల నారగించియు, మిక్కుటమగు సంతసమున
గండుకోయిల పిండులొక్కచోఁ జేరి, పంచమ స్వరమునఁ
బాడు పాటలు ప్రాంతముననే కల ప్రవిమల యమునాతరంగిణీ
తరంగ మాలికలలోఁ బ్రతిధ్వనించుచుండెను.

ఆ వనమధ్యమున నొక కాసారము కలదు. కమలబాం
ధవుని విమలకిరణాశ్రిత ప్రసారముచే నాకమలాకరాంతర్గత
కమలచయము వికసించియుండెను. కుముదకుసుమ నికరము
మాత్రము ముకుళించి యుండెను. పరిఫుల్లపుండరీక పుష్పంబు
లందలి మకరందమును గ్రోలి యంబరమున కెగసి భ్రమరం
బులు మధురంబుగా గాన మొనర్చుచుండెను. పలువిధముల
యిన జలవిహంగముల కాకములాకరమాకరమై యుండెను. అది
భీకరవనమైనను, సింహ శార్దూల వేదండ వరాహాది క్రూర
సత్త్వములు లంతగా లేవు. మృగగణము మాత్ర మందందు
విచ్చలవిడిగాఁ బచ్చిక మేయుచుండును.

మధువనము దాపున కేగుసరికి ధ్రువకుమారునకు
మధురసౌరభ మొకటి వచ్చెను. ఆ సుగంధములు పరతెంచు
ప్రదేశమే మధువనమని యాతఁడు తలఁచెను. ఆవైపునకే పోవు
చుండెను. అంతలో గరుడపక్షి యొకటి గగనమున విహరిం
చుచుఁ "గృష్ణా" యని కూసెను. ధ్రువుఁడా శబ్దమును విని

పరమానంద మొంది, పక్షిరాజమున కొక ప్రణామము కావిం చెను. ఆవిహంగావతంసంబున కాదినారాయణుని సందర్శన మైనది. లేకున్న 'కృష్ణా' యని యేల స్మరించు నని యాతండు తలంచెను. దానికొదవిన భాగ్యము తన కెప్పుడా యని నిట్టూ ర్పువిడచెను. మఱల నంతలో ధైర్యమూని వనోన్ముఖుండై నడ చుచుండెను. అప్పుడే యాతనికి హరిసేవాసక్తి యతిశయిం చెను. భక్తిపాశము భగవంతుని బంధించునని ధ్రువకుమా రుండు భావించెను. నారదతాపసోత్తముండు నుడివిన గురుతుల వలన మధువన మదియే యని గ్రహించెను. అందలి ఫలవృక్ష ములం దిలకించుచు, వనమంతయుం గలయం దిరిగెను. ఆ వన సౌందర్యమున కెంతయో యబ్బురపడెను. వనమధ్యమునం గల కాసారము కడ కేగెను. అందుం బుష్పించిన వివిధపుష్ప ములను గాంచి ముచ్చటంబడెను. కొన్ని పుష్పాలు గోసి కను లకద్దుకొని యొక తామర పర్ణము నందుంచెను. రెండు తామర పుష్పాలు కోసికొని చెవులమధ్య నిడికొనియెను. కర్ణ ద్వయమునందున్న కమలముల కాంతి ధ్రువున కెంతయో వింతశోభ యొనఁగూర్చుచుండెను.

ధ్రువుండచ్చటనుండి యుత్తరముగ నడచెను. అచ్చట విమలజలములతో యమునా స్రవంతి ప్రవహించుచుండెను. అతం డా నదీశోభను గాంచి మఱింత యానంద హృదయుం డయ్యెను. ఆనదీతీరముననే యొక పొన్నవృక్షము కలదు. అది

గుబురుగా బెరిగియుండెను. భానుకిరణములు లాతరువుక్రిందఁ దగులుటలేదు. చల్లగానుండెను. ఆ వృక్షమెంతయుఁ దనకు భగవత్ప్రార్థన మొనరించుటకుఁ దగిన నెలవని ధ్రువకుమారుఁడు తలంచెను. క్రిందరాలిన యెండుటాకులను జిమ్మి వేసి శుభ్రపఱచెను. ఆ మహీరుహమున కానునట్లుగ నొక వేదికను వేసెను. అంత నా బాలుఁడు కాళిందీవారిని జలకమాడి శుచియై పొన్నవృక్షము క్రిందఁ గూరుచుండి యొక్కమాఱు భగవానుని స్మరించెను. కనులు మూసెను. అతని కేదియో "దివ్య తేజము" ఇది యది యని నిర్ణయించుటకు వీలుగాని యాకారమునఁ బొడగట్టినట్లుండెను. ధ్రువు డాదివ్య తేజమును గ్రహింపలేకపోయెను.

నారద గానామృత పానమున నా బాలుని కాకలి దప్పులు కలుగలేదు. భగవత్ప్రార్థనానందమున శ్రమయుడంగెను. శతసంవత్సరములు తపమాచరించిన మహామునులకైన లేని యఖండతేజ మా బాలుని మోమునఁ దాండవమాడుచుండెను. దర్భాసనాసీనుఁడై ధ్రువుఁడు వేదిక చెంతఁ గూరుచుండి, పరమేశ్వరుని విగ్రహమునందుఁ బ్రతిష్ఠించి సరోవరమునుండి గొని తెచ్చిన సరసీరుహము లొక్కొక్కటిచేఁ బూజింప మొదలిడెను. అప్పుడే యతనికి భక్తిబీజము నాఁటుకొనెను. ఆరాధనమైన పిదప నా రమావల్లభుని పాదపద్మమందు హృదయముంచి, యా బాలకుఁడు ప్రపంచమునే మఱచెను. క్రమ

క్రమముగ వాని కనులు కేదియుఁ గనఁబడుట లేదు. మనోహర మధుర విహంగారావములయిన నాతని వీనులకు వినబడవయ్యెను. ప్రభంజనుఁడు కుసుమ సౌరభములఁ గొనివచ్చుచున్నను నాతని నాసిక యాఘ్రాణించుట లేదు. మానసమున కన్యవిషయములు స్ఫురించుట లేదు. పవనాఘాతిఁ బండుటాకులప్పుడప్పుడు ధ్రువునిపై రాలుచున్నను జర్మమునకుఁ దెలియుట లేదు. మానసముతోఁ బాటు పంచేంద్రియముల సైత మా బాలుఁడు మాధవార్పణముఁ గావించెను.

సూర్యభగవానుఁ డప్పుడే క్రుంకఁబోవుచుండెను. దిశలు కాంతిహీనములు కాఁబోవుచుండెను. శకుంత సంతానములు పాదములఁ జేరుచుండెను. అట్టి సమయమున ధ్రువుఁడు సమాధినుండి లేచి పరిసరతరువరముల చెంతకేగి కొన్ని పరిపక్వ ఫలములఁ గొనివచ్చి నీరజాక్షునకు నివేదనముఁ గావించెను. పరాత్పరునిఁ బూజించిన పుష్పముల నాఘ్రాణించి శిరమున ధరియించెను. పదపడి భగవన్నివేదనము నొనరించిన ఫలములఁ గొన్నింటిని యాతఁడు భక్షించెను.

కొంతవడికి, కుముదబాంధవుఁడు దన ధవళ చంద్రికలఁ బ్రకాశింపఁ జేయఁజొచ్చెను. అప్పట్టున, ధ్రువకుమారుఁ డచ్చటఁ గూరుచుండి యుండ, తాను రాజభవనమున కేగుట యచ్చటి పరాభవము-నాతని తలంపునకు వచ్చెను. తండ్రి

యింక నెక్కు భాగ్య మెవ్వఁడా యని తలపోసెను. అంతలో నాతని కన్నియుఁ దుచ్ఛసుఖములని తోఁచెను. శాశ్వతానంద పదవి నందఁగోరెను. లోకపిత నర్చింప లోటు కలుగదను కొనెను.



# ఏడవప్రకరణము.



"పుత్రకా! ఈపాటి కేపాటి దూరమేగితివో కద! వేకువనే పోవునాఁడింత చలిదియన్నమైనను దినలేదే? నిదురనుండి లేవంగనే "అమ్మా! ఆఁకలే" యనువాఁడవే నాయనా! ఇప్పు డాఁకలిబాధ కెంత తపించుచుంటివో కద. సమయమున కిన్ని మంచినీరయినను లభింపని యరణ్యముల నెట్లు గడచితివి తండ్రీ! అయ్యో! అనరాదుకాని కరిహరి శరభ శార్దూలాది క్రూర మృగ సంచార భయంకర కాంతారమే!! కంటకయుతము లగు కాలిబాటలనేగుచు నెంతగాసిఁజెందితివో? కాననములు మాఱుమ్రోయు నట్లరచు ఘాతక జంతువుల భీకరారావము కెంత భీతినొందితివో? దావపావకుఁడు చెలరేగి దహించు దుర్గ మారణ్యములఁగాంచి మదినెంత జంకితివో గద! కుమా రా! గాఢాంధకార బంధురములయిన కాననములందు మార్గ

ముఁగానక యెంతసంకట పడితివో ? ఇవియన్నియుఁ దలఁపునకుఁ గలిగినపుడెల్ల నాహృదయము దహించుకొని పోవుచున్నది. నాయనా ! నన్నిట్లు దుఃఖాంబుధిఁబడఁద్రోసి యేగితివే. నేనీ దుఃఖము నెట్లు భరింతును. "తన కొంగునఁగట్టిన రూక, తన కడుపునఁబుట్టిన బిడ్డ యెన్నటికైనఁ బనికివచ్చునన్నట్లు భర్త యనాదరించినను, నీవేలోకమని పంచప్రాణము నీయందే యుంచి బ్రదుకుచుంటినే ఇప్పుడెట్లు దుర్భరదుఃఖ జీవయాత్రఁ గడుపుదునోయి తండ్రీ !

నీ కుందనమువంటి మేను-సుందరమైన మోము-విశాల ఫాలభాగము-కళకళలాడు కన్నులు పాలుచిందెడు బుగ్గలు-కోమలములయిన కురులు-నవ్వినప్పుడు ముత్యములవలె మెఱయు పల్వరుస-లేఁత మామిడియాకులవంటి చిన్ని పాదములు-నీముద్దులమూటలు నాకన్నులఁ గట్టినట్లున్నవన్నా ! "తల్లీ!" యనుచు నాదరికెపుడు చేరుదువురా నాయనా! ఎప్పుడు నీ సుందర ముఖారవిందము ముద్దిడుకొందునురా ? పతియనాదరణమునకే పరితపించుచుండ "గోరుచుట్టుపై రోఁకటిపోటువలె" నింతలో సుతుని వియోగమా! కటకటా! కమలాక్షా! నీ కెంతకరుణ లేకపోయెను ?

నాతనయుఁడు రాజ భవనమున కరుగనేల ? పరాభవమేల జరుగవలె? కాననములకేగు తలఁపేల కలుగవలె ?

బాలునకింతటి పౌరుషమా ? అయినను 'అమ్మా ! యడవుల కేగి తపముఁ గావించుకొందునేయనఁ "చిన్నవాఁడవు నా యనా ! పోఁజాలవని" గట్టిగాఁ బలుకకపోతినే ? తుదకుఁ దనయుని వనగమనమున కనుమతించితినే ! ఆహా ! నేనెంత పాతకిని ! సుతునితో నేనును గాననముల కేగఁ గూడదా ? లేకున్న వనముల కేగు యత్నము "వలద"ని వారింపఁగూడదా రాజవంశమం దెచ్చటనైన బాల్యముననే తపమొనరింప నేగిరా ? బాలులందఱివలె నాతనయుఁడు కనుపింపఁడు. వాని యందేదో దివ్యశక్తి యున్నట్లున్నది. పూర్వజన్మమునఁ దన తపము భరింపమి నిప్పుడిట్టులేగి యుండును"-అని సునీతి తన సౌధమున గూరుచుండి విచారించుచుండెను. అంతలో వడి వడిగ నొకవనిత యచ్చటి కేగుదెంచుచుండెను. ఆమెముఖ మున సంతోషము తాండవింపుచుండెను. ఏదియోయొక శుభవార్తఁ గొనివచ్చుదానివలెఁ గనుపట్టుచుండెను. ఆమె ప్రాయ మిరువదియేండ్లుండును. సాధారణపుదుస్తుల ధరియిం చియుండెను. అంతగా నాకాంత సౌందర్యవతికాదు. కాని, కురూపిమాత్రముకాదు. ఆమె పేరు గుణవతి. సునీతి రాజ సౌధమునకు వచ్చిననాఁటనుండియు గుణవతి దాసిగానుండెను. సునీతికి గుణవతియన్న యంతయోకరుణ-రాణియందు సహి తము దాసికి భక్తిమెండు.

అధికారమున్నంతవఱ కెవ్వరైన నాదరింతురు. అది లేనియెడల దరికైనను జేరరు. అట్టిసమయమున సాయపడిన బాంధవులుకాని, మిత్రులుకాని, సేవకులుకాని కొనియాడ వలసినవారు. రాజు సునీతిపై ప్రేమలేక సౌధాంతరవాసము గల్పించినను గుణవతికిమాత్రము తన యజమానురాలియం దలి భక్తి నశింపలేదు. అప్పటికైనను గుణవతి రాజమందిర మునఁ బరిచారికగానుండి యెప్పుడప్పుడు సునీతి మందిరమునకు వచ్చి, యజమానురాలియందలి భక్తిఁజూపించుచునే యుండెను అందువలన గుణవతి గుణవతియనియే చెప్పవలయును. సునీతి కుమారునిఁ దలంచి దుఃఖించునపు డెప్పుడైన గుణవతివచ్చినేని యామెనూరడించి ధైర్యమొసంగు చుండును.

ఆనాఁడట్లు వేగముగ గుణవతి సునీతిగృహమున కేగు నప్పటికి నాసతి సుతునిగూర్చి వాపోవుచుండెను. అట్టియెడఁ బరిచారిక యురుదెంచి యామెదరికేగి, "అమ్మా! చింతింప కుము. మంచి శుభవార్తఁదెచ్చితి" ననెను. ఆమాటవిని సునీతి 'పెన్నిధింగన్న పేదవోలె' "గుణవతీ! ఏమిశుభవార్త వేగ దెల్పు" మనెను.

గుణ—అమ్మా! నారదమహర్షులవారు నేఁడు మహారాజుల గృహమున కేతెంచిరి.

సు—అయ్యో! ఆసంయమీంద్రునిఁ గాంచు భాగ్యము నాకు లేదుకద? వారు నాబోటి నిర్భాగ్యురాలికి దర్శన

మిత్రురా ? అదిలేకున్న నాత్రిలోకసంచారి దివ్యనామ మైనను వీనులారా వింటిని. నిజమే నేఁడు శుభ వార్తయే.

గు—దేవీ ! అంతియకాదు. మహారాజుగా రప్పుడు ధ్రువకుమారునిం దలఁచి, తాను గావించిన యవివేకపు కార్యమున కెంతయుఁ జింతించుచుండ నాసమయమున నారదఋషీశ్వరు డరుదెంచెను.

సు—గుణవతీ ! అప్పుడేమి జరిగినది ?

గు—అట్లేగుదెంచి సంయమీశ్వరుఁ డాతని మనోవ్యథ నెఱింగి "రాజా ! ఏలవిచారించుచున్నాఁడవు ?" అని యడిగెను. అందులకు నీ నాథుఁడు కలవిధమంతయుఁ దెలియఁబలికి నారదమునీంద్రా ! నాతనయుఁడేయెడ నేయడవిఁ దిరుగాడుచున్నాఁడో ! స్త్రీలోలుండనై కామాంధకారమునఁ గన్నుఁగానక సకల సద్గుణాలవాలుఁడైన మత్కుమారునిఁ గానలపాలొనరించి, నిరంతర మనంత సంతాపసంయుత స్వాంతుడనైతి" నని నుడివెను.

సు—చెలీ ! నాజీవితేశ్వరుఁడు, తన సంతాప మా సంయమీశ్వరుని కెఱింగించినప్పుడు సర్వజ్ఞుఁడైన నాతఁడు తనయుని వృత్తాంత మేమయినఁ దెలిపెనా ?

గు—తల్లీ! తెలుపకేమి? త్రికాలజ్ఞులైనతాపసోత్తము లెఱుం
గరాని యర్థముగలదా? నీ బాలకుండా నాఁడడవులం
బట్టి పోవుచుండ నారదుఁ డెదురుపడి, విపినములకేగు
ప్రయత్నము మాన్పఁజూచెనఁట. ఎంతచెప్పినను నీ తన
యుఁడు వినలేదఁట. పరమేశ్వరునిఁ బ్రార్థించు పట్టుద
లను బాయలేదఁట. అందుల కా మునిచంద్రుఁడు హర్ష
మొంది, నీకుమారునకు రమేశ్వరు నారాధించు రహ
స్యము నెఱిఁగించి యొక్క తపోవనమును దెలిపి,
యచ్చటి కేగి తపమాచరింపు మనెనఁట.

సు—అమ్మా! గుణవతీ! నా పుత్రుని కుశలోదంతమును
దెలిపి నాకెంతయు మోదమొనగూర్చితివి. నీ ఋణమె
న్నటికినిఁ దీర్చుకొనఁజాలను. ఇంకేమయిన ధ్రువుని
గూర్చి ముచ్చటించెనా?

గు—దేవీ! ఈవృత్తాంత మెఱింగి, సంతోషస్వాంతుఁడై యున్న
రాజుం గాంచి, మౌనీంద్రుఁడు, "నరనాథా! నీ తన
యుఁడు సకల జీవపాలకుఁడైన సర్వేశ్వరుని సంరక్ష
ణము నొందియున్నవాఁడు. అతని కే యాపదలును
లేవు. ధ్రువకుమారుని యశశ్చంద్రికలు సర్వదిగంత
ముల వ్యాపించును. తన పూర్వజన్మసుకృత సంచయ
ఫలముచేత బ్రహ్మేంద్రాదులు పొందరాని దివ్యప

దంబు నొందఁగలఁడు. భూపాలా! నీ తనయుని ప్రభావం బీ వెఱుంగవు. దేవతలాతని తపమున కలరి సంతసము సేసలిడుచుండిరి. గంధర్వు లాతని విజయమును గానము నొనరించుచుండిరి. నీ కుమారుని యశమును నీరదములు గంభీరనినాదమున ఘోషింపుచున్నవి. అట్టి సుతునిం గాంచిన నీసుకృత మేమనవచ్చును! నీ కీర్తి సైతము లోకములందా కల్పాంతస్థాయిగా నీ పుత్రుఁడే దిద్దితీర్చును. జగత్పావనుఁడైన నీ సుతుఁడు పరాత్పరు నర్చించి వరములఁ బడిసి కొలఁది కాలములో మఱలి రాఁగలఁడు. మీకుఁ బ్రియము సేకూర్పఁగలఁడు. కావునఁ గుమారునికై చింతఁ దక్కియుండు" డని యానతిచ్చి వెడలిచనెను. కావునఁ దల్లీ! సునీతి! నీవుమఁ గుమారుపైఁ గల బెంగనువీడి మోదముతో నుండుము.

అని యీ వృత్తాంతమును దెలిపి, గుణవతి వెడలి పోయెను. సునీతి యంతయు నాలించి యానందపారవశ్యము నొందెను. తనయుని రక్షింప వనదేవతలను బ్రార్థించెను. అన్నిటికిని హరియే కలఁడని సుతుని సంరక్షణము శ్రీకాంతునిపైనిడి సతము నంబుజాక్షు నారాధించుచుండెను.



# ఎనిమిదవప్రకరణము.



"మంగళకరా! రమామనోరమణా! జగద్రక్షాదీక్షా రాజీవాక్షా! నీలనీరదోపమానతనూవిలాసా! శ్రీనివాసా! జగన్మోహనాకారశరీరా! భక్తమందారా! సనకసనందనాది మునిచంద్ర మానసాభరణచరణా! భవహరణా! నిరంజనా! నీవు సంకల్పమాత్రమున సకలచరాచరముల సృజించి, సంరక్షించి, సమయించెదవు. నీమాయాఛాయావిలాసమును, నీ లీలామానుష విగ్రహమును దేవతలైనను దెలియఁజాలరు. గగనతలమందలి తారాగణమైనను లెక్కింప వచ్చునుగాని నీ యనంతకోటి కల్యాణగుణములఁ గణుంగొన నెవరితరము?

అరవిందోదరా! నీ దివ్యపాదారవింద ద్వంద్వప్రభావ మొక్కపరి నెదలోఁ దలఁచిన నజ్ఞానాంధకారదూరులై సంసారార్ణవమును దరించి సుఖింతురు. నీ నిర్మలనామమును జపించువాఁడు జననమరణములనుండి విముక్తుఁడగును. సరసీరుహవీక్షణా! నాకు నీచరణకమలసేవఁ గలిగింపుము. నీ దివ్యనామ మాహాత్మ్యము నెఱుంగు జ్ఞానము నాకుఁ గలిగింపుము." అని మధువనమున ధ్రువుఁడు మధుసూదనుని గుఱించి పలుతెఱంగులఁ బ్రార్థింపుచుండెను.

అట్టుల నిశ్చల చిత్తంబున నాబాలుఁడు తపమొనర్చుచు మూఁడుదినముల కొకపరి కపిత్థ బదరీ ఫలాదులఁ బరమప్రీతిగ భక్షింపుచుఁ బ్రథమ మాసమును గడపెను. పదపడి యాతఁ డాఱేసి దినంబుల కొకతూరి జీర్ణతృణ పత్రములాహారముగాఁ గొనుచు ద్వితీయ మాసము వెడలనడిపెను. నవరాత్రముల కొకమాఱుదకపానము గావింపుచు దుర్భర తపోనిష్ఠచేఁ దృతీయ మాసమును వేగించెను. ద్వాదశదివసముల కొకమాటు వాయుభక్షణము సేయుచుఁ బంచేంద్రియముల జయించి, యతిదారుణ ధ్యాన మొనరింపుచుఁ జతుర్థ మాసమును వెళ్లబుచ్చెను. పంచమమాసమునఁ దుదకు వాయుభక్షణమునైన నొల్లక, నిరాహారుఁడై శ్వాసనిరోధించి, యేకపదంబున ధరాతలంబున నిల్చి, సర్వేంద్రియముల జగదిశ్వరార్పణమును గావించి, మహాయోగ నిష్ఠాగరిష్ఠుఁడై సజీవప్రతిమవోలె భయంకర తపోదీక్షాపరతంత్రుఁడై యుండెను.

అట్లూర్ధ్వబాహుఁడై యేకచరణమున నిల్చి, యత్యుగ్రతప మాచరింపుచుండ నాదుర్వార తపోమహాగ్నికీలలు దశదిశలు వ్యాపించెను. అమ్మహాజ్వాలలనుండి వెలువడు ధూమసంచయములు మేఘాకృతినిఁ దాల్చి గగనసీమను గప్పివైచెను. అవని యంగుష్టపు టాఁకుడువలనఁ గలిగిన నలవికాని బాధచేఁ బుడమి 'గడగడ' వడఁకి యొఱగిపోయెను. జలనిధులు కలగుండువడి కంపింపఁ జొచ్చెను. అంతరిక్షము నందలి నక్షగణ

మొక్కటొక్కటి యూడిపడఁగడఁగెను. జలదములు గర్జిల్లి వడివడిఁ బిడుగులు విడువఁదొడఁగెను. సూర్యచంద్రుల మార్గమవరోధమయ్యెను. చరాచర ప్రపంచమంతయు నుదరమునఁ గల పరమేశ్వరునియం దాబాలుఁడు మనస్సు నిల్పి తపస్సు గావించుటవలనఁ బరమేశ్వరునియందును గంపము గలిగెను. అంతట కంపింపఁ గుక్షినిఁగల నిఖిలభువనములు ప్రళయకాల ప్రభంజనాహతిం గంపించు సముద్రపు టోడవలెఁ దల్లడిల్లఁ జొచ్చెను.

ఇటుల సకలలోక సంక్షోభకరంబుగ ధ్రువుఁ డతిఘోరతపము సలుపు సమయమున దిక్పాలురెల్లరు దిగులుపడిరి. మౌనిబృందము భయమంది ప్రళయసమయమని భావించెను. తక్కంగల ప్రాణికోటి చావ సిద్ధముగ నుండెను.

ఆ భయంకర తపోమహాగ్నివలనఁ గలిగిన పీడ నెఱింగి దేవపతి, యాతని తపోవిఘ్న మొనరింప భూతప్రేతపిశాచ రూపులగు కూశ్మాండకపిండులఁ జేరఁజీరి యిట్లులనియెను. "కూశ్మాండకులారా! సరయూనదీతీరమునఁ గల మధువనమున ధ్రువుఁడను రాజకుమారుఁడు తపమొనరించుచున్నవాఁడు పంచవర్షముల ప్రాయముఁ గల బాలుఁడైనను పట్టుదలతోఁ దపమొనర్చుచున్నవాఁడు. అతనియొద్దకేగి, మీ నేర్చినయట్టుల భయంకరాకారధారులై యతనినిఁ జేరి జడిపించి, తపోవిఘ్నముఁ

గావింపుఁడు. ఎట్టుల మీప్రజ్ఞావిశేషములఁ బ్రకటించి, యాతని తపోవిముఖునిఁ గావింతురో కాంచవలయును. మగిడి వచ్చి యీ వృత్తాంతముఁ జెప్పు పర్యంతము నాచిత్తము తత్త ఱబడుచుండును. సఫలీకృతమనోరథులు కండు. వేవేగ నేగుడు. అప్రమత్తులై యీకార్యము సాధింపుఁడు. కార్యసాఫల్యతే నొంది, నాకెఱింగించినవారికి గొప్ప పసదన మొసఁగెద."

ఈరీతిగ బిడౌజుఁడు నుడివిన వారలు ధీరులై మీఱిన సంభ్రమమున రాకుమారుని తపోభంగ మాచరింప మధువన మున కేగిరి.

కూశ్మాండకు లొకతెగ నిశాచరులు, కామరూపులు, అమిత పరాక్రమవంతులు, స్వామి కార్యాచరణ దీక్షాద క్షులు, సురపతిచెప్పిన చొప్పున నడచుచుందురు. అందువల ననే దేవేంద్రుఁడు వారలీకార్యము నెఱవేర్తురని యెంచి పం పించెను.

అట్టులా రక్కసులు మధువనమును జేరిరి. అందలి పండ్లను గడుపారఁ దినిరి. యమునానదీతోయములఁ ద్రావి యతికయిల్లి, యట్టహాసమును జేయుచుఁ గొందఱు కాలా హల ప్రతిమాన విషభూయిష్ఠ భుజంగరూపులై ధ్రువునిఁ జేరి విషాగ్నికణములు వెడలఁగ్రక్కుచుఁ గఱువఁబోవుచుండిరి. కొందఱు కరిహరి శరభ శార్దూలాది భయంకర సత్త్వరూప

ములఁ దాల్చి వదనగహ్వరములఁ దెఱచి నిర్ఘాత ప్రతిమాన కఠోరభీకరారావముల సలుపుచు నాబాలునిఁ జుట్టుముట్టి మ్రింగఁబోవుచుండిరి. కొందఱు భూతపిశాచాది వికృతరూపముల ధరించి దుష్టచేష్టలు సేయుచుఁ గైబడ నటించుచుండిరి. కొందఱు చిటపటధ్వనులతో దావాగ్నినిఁ బ్రజ్వరిల్లఁ జేసి వనమంతయు భీభత్సముఁ జేయుచుండిరి. కొందఱు గాఢాంధకారమును గల్పించిరి. కొందఱు విషవాయువుల విడఁ జేసిరి.

అట్లు వారనేక విధముల భయంకర దృశ్యములు చూపించినను ధ్రువుఁడు చలింప మిక్కిలి విసిగి యొక్కచోఁ జూర్చుండిరి. వారి ఘోరసర్పాకారవదన విముక్త విషజ్వాలామాలికలు సోకి పరిసరపాదపములు కుమిలి కాలిపోయెను. కాని ధ్రువకుమారుఁడు చలింపలేదు. వారి దుష్టమృగాకార భీషణరవములకుఁ బ్రకృతి వెఱగంది ప్రతిధ్వనించెనే కాని యాబాలుఁడు కన్నుఁదెఱువలేదు. వారి పిశాచరూపములఁ గాంచి వన్యమృగములు భీతినొంది పరువెత్తెనే కాని యాతఁడు లక్షింపలేదు. వారంటించిన దావపావకశిఖలు చెలరేగి వనము దహించెనే కాని ధ్రువుని సమీపమునకైనను జేరలేదు. అతని సర్వేంద్రియములు శ్రీపతి కర్పణముఁ గావించి యుండ బాహ్యవిషయము లాతని శ్రవణము లెట్లు వినును? కన్ను లెట్లు కాం

చును ? మన మెట్లు చలించును ? ధ్రువుని తపోనిశ్చలత యట్టిది. ఆతని పూర్వజన్మ సుకృతపరిపాక మట్టిది. నారదహితోపదేశ మట్టిది. ఆ బాలుఁడు శ్రీమన్నారాయణుని, మానసమందు సాక్షాత్కరింపఁ జేసికొని యానందపారవశ్యము నొందియుండెను. ఉచ్ఛ్వాసనిశ్వాసములు బంధించి చేతనరహిత స్థాణువయ్యెను. అట్టివానికి, రక్కసులు సేయు దుండగములు, స్ఫులింగాగ్నిచే జలధినిఁగాల్పఁ దలంచినట్లు, వృధకాక పోవునె ట్టులు ? అంతలో నూఱుకుండ కా కూశ్మాండకులు మఱల మఱల నెన్నియో యుపకృతులు సలిపి నిరుత్సాహులై విఫల మనోరథులై, యింద్రుని కడ కేగిరి.



# లోమిదవప్రకరణము.



"ఔరా ! ఆ బాలుఁ డెంతటి తపోనిష్ఠాపరుఁడు. మదీయానుచరులేగి యెన్నిభయంకర కృత్యములు సలిపినను, యెన్ని మోసములు గావించినను రవ్వంతైనను చలింపలేదఁట ఏమా తని తపోనిశ్చలత పూర్వమెందఱు తపమొనరింపలేదు ? ఎందఱు తపోవిఘ్నులు కాలేదు ? ఇట్టి ఘోరతప మెందయినను గాంచితిమా ? ఏమో ! యొక బాలుఁడు కదా ! నిముసమాత్ర

మున వెఱఁగంది తపోవిముఖుఁడుగాఁడా ? యని తలంచితిని. కాని యిట్లగునని కలయందైనను దలఁపనైతినే ! బాలుఁడగు వాఁడింతటి భయానక దృశ్యములఁ గాంచి భయమొందకుండుట కేదియో ప్రబలకారణముండవలయును. ఒకవేళ మదీయపదము వాంఛించి తపమొనరింపుచుండెనా ? లేకున్న సృష్టికర్త స్థానమాక్రమింప నెంచెనా ? తగినకారణమేమియో యాన యకఁ దహాతహాపడుచుంటిని. కానిమ్ము. సర్వమున కా శ్రీరమణీమనోహరుఁడే కలఁడు.”

అని దేవేంద్రుఁడు దినాంతసమయమున నందనవనమున నటునిటు దిరుగుచు విచారగ్రస్తుఁడై యుండెను. అప్పుడాతని కేమియుఁ దోఁచుటలేదు. ఒకమాఱు పారిజాతాది తరురాజముల చెంతకేగును. ఒకమారు నందనవనమునం గల సుందర మందిరమున కేగి కూరుచుండును. అచటను జిత్తము స్థిరముగా నుండక మందాకినీ నదీతీరమున కేగును. అట్టియెడ శచీదేవి రంభాద్యప్సరసలతోడఁ గూడి నందనమున విహరింప వచ్చెను. కొంతతడవు వారలు విహారమును సల్పి పుష్పావచయ మొనరించిరి. మేనక పారిజాత ప్రసూనరాజములనేరి శచీపురందరుల నలంకరింప మాలలు గట్టఁగడఁగెను. రంభాదులు సుగంధయుతములయిన వివిధపుష్పములనేర్చి చెండ్లను గ్రుచ్చుచుండిరి. ఇంద్రాణి మెల్లనఁ బతిచెంతకేగెను. అప్పు

డింద్రుఁడు ధ్రువుని తపోవినాశనముఁ గావించు యోచనా పరంపరలలో నుండెను. శచీదేవి యరుదెంచుటయుఁ, జెలులతో విహరించుటయు, నాతఁడెరుఁగడు.

అతఁడట్లు వ్యాకులమానసుఁడై యుండ సురరాజి దరిజేరి "నాధా! అరుగో రంభాదులు. పారిజాతపుష్పమాలికలు కేలంగీలించి మనలం బూజించుట కరుదెంచుచుండిరి. చూఁడుడు. నేఁడు వారలు నూతన నాట్యములు సల్పుచున్నట్లున్నదే! ఆహా! యేమి! మేనక నటనాకౌశలము! పుష్పమాల విచిత్రముగఁ ద్రిప్పుచు నృత్యమొనరించుచున్నది. వారి గానమెంత శ్రావ్యముగ నున్నయది! కోకిలకులకోలాహలములవలెఁ బాడుచుండిరి. ఊర్వశి వీణావాద్యములో నేర్పరి సుమా! ఆమె తన మధురకంఠము విపంచీపంచమ స్వరమున మేళవించి, యెంత మృదుమధురముగ గాన మొనరింపుచున్నదో కాంచుడు." అని యేమేమియో పలుకుచుండఁ బాకశాసనుఁడు వారించి "దేవీ! నేఁడు నాకేమియు రుచించుటలేదు. కొంతతడవు మాటాడకూరకుండుము. నామనం బొక ముఖ్యకార్యాచరణాసక్తము యున్నది. నీవును మేనకాదుల కడకేగి మఱికొంతతడవు విహరింపు" మనెను.

శచీదేవి యా పల్కు లాలించి మనమున భీతినొంది, "ప్రాణేశ్వరా! ఏల యీకరణినిఁ బలుకుచున్నవారలు? నేఁడు

మీముఖాబ్జము వాడఁబాఱియున్నదే! ఎద్దియో వ్యాకులచిత్తులైనట్లుంటిరేమి? ఎన్నఁడైన మననందనమున నిట్టులాడియుండిరా? ఇట్లుత్సాహరహితులై యుండిరా? దీని కెద్దియేని కారణముండి తీరవలయును. అర్ధాంగినైన నాకు మీమనోవేదన మొకింత దెలుపఁగూడదా? మీరిచట నాందోళితమానసులై యుండ నేవటకేగి విహరింతునా? మీసంతసమే నాసంతసము. మీదుఃఖమే నాదుఃఖము. జీవితేశ్వరా! మీమనమునఁ గల వ్యాకులమేదియో సెలవీయ వేఁడెద" నన, వారిరువురకిట్లు సంభాషణము జరిగెను.

ఇంద్రు—దేవీ! ఏమని చెప్పుదును. అనవరతము నాడెందమున కెద్దియో కొందలమే. నాకరాజ్యమున కధిపతినై, ముప్పదిమూఁడుకోటుల దేవతలకు నాథుఁడనై, నేనును దానవభీతిచే నెల్లప్పుడు ప్రాణ మఱచేతఁ బట్టుకొని యుందును. సంతత మెవ్వఁడో యొకదానవుఁడు చెలరేగి దేవతలను, మునులను బాధింపుచుందును. వాని సంహారణమునకై యెన్నియో పాట్లు పడుచుందుము. ఎప్పుడెవ్వఁడు తారసిల్లి, గాఢతపమాచరించి, నాపదమధిరోహించునో యని కుందుచునేయుందును. అబ్బా! ఇట్టిదుఃఖైకమూలమైన యీపదము నాకేల? కాల్పనా? సర్వసంగ పరిత్యాగినై కానలకేగి తపమాచరింపుచుఁ గాలము గడపుటయే మేలని తోఁచుచున్నది.

శచీ—నాథా! ఇప్పుడెవ్వఁడైన మానిబృందారకులకుఁ గీడు సేయ సమకట్టియుండెనా? లేక మీపదవినొంద నెవ్వఁడైన నుగ్రతపమాచరించు చుండెనా?

ఇం—ఇప్పటికి బాధయేమియు లేదు. కాని యొక్కఁడు మాత్రము భయంకర తపముఁ గావించుచున్నవాఁడు.

శచీ—ప్రాణేశ్వరా! ఎవ్వఁడాతఁడు? ఎచ్చటఁ దపమొనర్చుచున్నాఁడు.

ఇం—ప్రేయసీ! వాఁడొక బాలుఁడు. ఉత్తానపాదుఁడను రాజకుమారుఁడు. మధువనమునఁ దపమాచరించుచున్నవాఁడు అతని తపఃపీడనముచే లోకములు కంపించినవి.

వారట్లు మాటాడుచుండ నంతలో నొక దాసియరుదెంచి, యంజలిఁ గావించి "దేవా! దేవతలును, మునులు తమరాకకై వీక్షించుచు, వైజయంతమున వేచియున్నవారు. దేవరకీ యుదంతమును దెలుపవచ్చితి" నని పలికెను. అంత దేవేంద్రుఁడు దిగ్గున లేచి తనసతిని రంభాదుల కడనునిచి యేగెను

అంతనమరులాతనిఁ గాంచి "పురందరా! పృథ్వీపీడన మిట్లుండ నీవూరకుంటివే" మని హెచ్చరించిరి. అందుల కతఁడు "సురవరులారా! నాచేతనైనంత వఱకాతని తపోభంగమునకై యత్నించితిని. తుదకు విఫలుఁడనైతిని. ఈవిషయ మెల్లరెఱింగినదే కద. ఇపుడు కర్తవ్యమేమి? గురూత్తమా! మాటాడ

రేమి ? ఆ బాలుని తపోవిజృంభణము నిలింపులు సైతము సైరిం పలేకుంటిరి కద. ఇఁక నొరుల విషయముసుగ నేల ? తమ రీ దుర్భర విషయమునఁ గర్తవ్యాంశము విశదీకరింపుఁ" డని వేఁడెను. బృహస్పతి యా పల్కులాలకించి, "ఇంద్రాదిదేవత లారా ! ఇందులకై మీరింతగ నేల వెఱపుఁ జెందెదరు ? సకల లోకజీవరక్షణము సేయ, శ్రీవిష్ణువే కలఁడు. వేఱు యత్న ములు మనకేల ? తాను సృజించిన లోకము లల్లాడుచుండఁ గాంచి యూరకుండఁ గలఁడా ? ఇక విచారింపఁ బనిలేదు. ఆ హరిచరణములే మనకు శరణములు. రండు ! అవికారశౌరినిఁ గాంచ వైకుంఠమున కేగుదము. "పరశ్రేయోద్ధారకరీ" యన్న ట్లు మన మా దారుణ విపత్పిశాచముఁ బాపుకొనుటయే కాక, యా దివ్యమంగళాకారుని గన్నులారఁ గాంచి పాపహరణమును గావించుకొంద' మని పొసఁగఁ బలికిన పలుకులకలరి నిలింపు లింపునొందిరి. దిక్పాలకులెల్లఁ హర్షించిరి. మౌనులందఱును మోదమందిరి. అంతట వారెల్లరును వైకుంఠగమనోత్సాహు లైరి.



# పదియవ ప్రకరణము.



చంద్రుఁ డప్పుడే పూర్వాద్రిపై నెక్కి తన శీతలకిరణ ములఁ బ్రకాశింపఁ జేయఁజొచ్చెను. అపుడు పద్మిని, లోక

బాంధవుని మనమునఁ దలఁచుచు నిశ్చలచిత్తముతో నుండెను. దోషాధిపది యదిగాంచి, తనకిరణదూతలఁ బద్మినీకాంతకు రాయబార మంపెను. అందులకుఁ గమలిని తుళ్ళిపడి "నా నాథుని స్పర్శనమిష్టముగా నుందును. ఈ శీతలస్పర్శన మెన్నఁ డెఱుఁగనే! ఇదెవ్వరిదో" యని శంకించి వైళంబ ముకుళించు కొనియెను. చిరప్రయత్నము వ్యర్థమయ్యెఁ గదాయని చంద్రుఁడు తెల్లపోయెనో యన బింబము తెల్లపడియెను. పరకాంతాగమన వాంఛదవిలి పరిభవమొంది తెల్లపోయిన పతినిఁ గాంచి పరిహసించుచున్నదో యన్నట్లు కాసారాంతర్గత కుముదకాంత వికసించెను.

అట్టియెడఁ బండువెన్నెల యంతటను నిండి, బ్రహ్మాండ మంతయు వెండి పళ్లెరమువలె మండితముగాఁ జొచ్చెను. హిమాంశు శీతకిరణములకు సుగంధ మందమారుతము తోడై సౌఖ్యదాయకముగ నుండెను. ఆపిల్లవాయువుల కందందుఁగల వృక్షాగ్రముల పర్ణములు చలింపుచు వెండిరేకులవోలెఁ 'దళ తళ' మెఱయుచుండెను. చక్రవాకము లచ్చటచ్చటఁ దిరుగుచు, వెన్నెలఁ దినుచు సందడి చేయుచుండెను.

ఆసమయమున దేవేంద్రాదులు వైకుంఠమున కేగు చుండిరి. ఆప్రశాంత సమయమున హాయిగనేగుచు వికుంఠ మెవ్వఁడు గాంతుమా యని యువ్విళ్లూరుచుఁ బోవుచుండిరి.

కొంతసేపటికి వారలు శ్రీనిలయంబై భక్తులపాలి దివ్యధామంబై చక్రధరు నివాసంబై, చెన్నొందు వైకుంఠపురమును సమీపించి కన్నుల కఱవుదీరఁ గాంచిరి.

ఆహా ! ఆపురి రామణీయకమెంత వర్ణనీయము ! ఆనగర సౌందర్యమును సహస్రశీర్షములుకల శేషుఁడు సైతము వర్ణింపఁ జాలకఁ గాఁబోలు శ్రీహరి శయ్యయై, యచ్చటనే వాసమే ర్పరచుకొనియెను. ఆ పట్టణ సౌధధవళ కాంతులు పెచ్చుపెరిఁగి కమలవైరి కాంతిని డిందుపఱచుటచేఁ గాఁబోలు నతని యందుఁ గళంక మేర్పడెను. ఆపురవాసుల పూర్వపుణ్యమెట్టిదో కాని శ్రీకాంతుని సంతతము సేవించు భాగ్యము లభియించెను. వారనవరత మిందిరా సుందరీరమణ చరణసేవా పరాయణులై యుందురే కాని వేఱువాంఛలఁ గోరఁబోరు. ఆపట్టణోద్యానము లన్నియు నమానాథుని పేరనే రాణించుచుండును. ఆ వనమందలి శుకపికాదులు నిరంతరము శ్రీధరు కథాగానములు సేయుచుండును. ఆవైకుంఠ పురమను సరోవరమున, సౌందర్యసౌధమను కమలమునఁ బుండరీకాక్షుఁడు చంచరీకము చందమున వెలయుచుండును.

అట్టి వైకుంఠముగాంచి బృందారకాదు లామోదమందిరి. క్రమముగా వారు పట్టణప్రాకారములఁ దాఁటి రాజవీథులఁగడచి శ్రీవిష్ణు నిలయమునకేగి తమయాగమన మెఱిఁగిం

చిరి. అనసూయమున క్షీరసాగర కన్యలతో దేవదేవుఁడు వినో దించు చుండెను. శేషుఁడు తన ఫణమునిప్పి సురటిచందాన వీచుచుండెను. తుంబురు డానందముగ గానమొనరించు చుండెను.

అట్టియెడ సురనాథాదు లరుదెంచిన వార్తవిని యార్త త్రాణపరాయణుండగు నారాయణుఁడు దిగ్గునఁ దల్పముడిగ్గి వారలుండు చోటికి వచ్చెను. అప్పు డా మురారి ధరించిన నవరత్నమయ హేమకిరీటము నందలి మంజులకాంతి పుంజములు నలుకెలంకులఁ బర్వులిడుచుండెను. వజ్రఖచిత కర్ణకుండలద్యు తులా పుండరీకాక్షుని గండభాగమున కెక్కువ విలసిల్లఁ బొచ్చెను. ఆయరవిందోదరు ముఖారవిందము కస్తూరీతిలకో ల్లసితమై సకలముని బృందారక బృందమును రక్షించుటకుఁ బ్రస న్నమైనట్లుండెను. ఆలోకేశ్వరు లోచనద్వంద్వము భక్తజను లఁగాపాడు కృపాతరంగములతో నిండియుండెను. ఆకంజాక్షు కంబుగళమునం గల హారావళిదీప్తులు కౌస్తుభమణిప్రకాశముతో లీనమగుచుండెను. ఆదామోదరు చతుర్బాహువులు దివ్యమణి ప్రభాభాసిత కేయూరకంకణాలంకృతములై శంఖచక్రగదా ఖడ్గములతోఁ బ్రకాశించుచుండెను. ఆయిందిరాధవుని చర ణము లరవిందములవలె నృమనలములై భక్తులకుశరణీయములై భాసిల్లుచుండెను. ఆ మధురిపు దేహకాంతి సాంద్రచంద్రిక యందు నైలము నిందీవరమును గ్రిందుసేయుచుండెను.

పొందు. ఆబాలుని తపఃఫలము పండి పక్వమైనది. మధువనమున కేగి యాతని కోరికఁ దీర్చి లోకసంక్షోభము మాన్పదను. భీతిదొఱంగి మీమీనివాసముల కేగుఁ” డని పలికెను. మహేంద్రాదు లాపల్కు లాలకించి హృదయవేదనము వీడిరి. ఇంకలోకమున కేయిక్కట్టులేదని తలంచిరి. తమపదవుల కేమాత్రము హానిరాదని నిశ్చయించిరి. అంతవారలు సారసాక్షునిఁ బ్రార్థించి సెలవుగైకొనెదమని పలికి, స్వస్థానముల కరిగిరి.



# పదకొండవప్రకరణము.



ఐదుమాసముల నుండియు నతితీవ్ర తపము సలుపుటవలన ధ్రువుని దేహము కృశించెను. కాని యాతని తనువునం దేదియో నూతన తేజము మెఱయుచుండెను. సహస్రవర్షములు యోగనిష్ఠాగరిష్ఠులై యుండు తాపసోత్తములకుఁ గూడ నలవడని దివ్యకాంతి యాతని ముఖారవిందమున వ్యక్తమగుచుండెను.

ధ్రువుని తపమున కదియే తుదిదినము. ఆనాఁడేదియో నూతనవికాస మంతటను గన్పట్టుచుండెను. మధువనమంతయు నూ, నవవికాసశోభితమై కన్నులపండువుగఁ గళకళలాడుచుం

డెను. ధ్రువుని తపఃఫలము పండినదని సూచించు చున్నదో యనినట్లు, సమీపమునఁ గల రసాలవృక్ష మొక్కటి పరిపక్వ ఫలభరితమై యుండెను. విహంగసంతాన మాదినమున నేదియో నూతనానందముఁ జెందినట్లు 'కిలకిల' లాడుచు నొక చెట్టు నుండి మఱియొక చెట్టునకుఁ బరుగిడుచుండెను. ధ్రువుని తపమున కవసానదశ వచ్చినదని, యింక నాతని దర్శనము గాదని గ్రహించి కాకోలు పారణవార మని చెట్టును మూఁగి పరుండి నెదురు వేయుచుండెను.

అప్పుడొక కోకిల మనోహరముగ నొకకూతకూసెను. ఆకూతయందేమి మహాత్మ్య మున్నదో కాని తపోనిమగ్నుఁడై యున్న ధ్రువునికి శ్రవణగోచరమయ్యెను. అతఁడు కన్నులు విచ్చిచూచెను. అపుడాకాశమున నొక మెఱపు విచిత్రముగ మెఱసెను. అనంతరము దేవదేవుని దివ్యస్వరూపము లీలగా మెఱసెను. అంతలో నాపరమాకారమును సౌదామిని మధువన మధ్యమునఁ గల రసాలవృక్షాగ్రమునఁ బ్రకాశించెను. అచ్చటికి ధ్రువునిమానస మయస్కాంతమువలె నాకర్షింపఁబడెను. తోడనే యాతఁడా వృక్షము చెంతకేగెను. అచట నేమియులేదు. పండిన ఫలములు మాత్రము నిండియుండెను. కొంచెము దూరమున కేగి మరల నాచూతమును జూచెను. అతని కాకాంతి కన్పడలేదు. అంత నాకాంతి సమీపమునఁగల

సరోవరమునఁ బ్రతిఫలించెను. శీఘ్రమే, ధ్రువుఁడు కమలాకరమునకేగి చూచెను. అందేమియుఁ గనుపడదాయెను. కమలములు మాత్రము చక్కఁగాఁ బ్రకాశించుచుండెను. అందొక నీరజమునందు తానుగాంచిన యాకారము సంకుచితమై యుండెను. ఆబాలుం డదిగాంచి, యత్యంతానంద మొంది జకీలున నాజలజమును ద్రెంచి తెచ్చెను. అందుమాత్ర మేముండెను ? స్వామిమకరందపానమును సలుపుచుండిన భృంగ మొక్కఁ డందుండి 'ఝుఝుమ్మ' బయటికివచ్చి, యెగిరిపోయెను. కుంగవర్భవోలె మెఱయుచుండిన యాకాంతి ధ్రువునకు గోచరముగాలేదు. నిశ్చలచిత్తమున నాతఁడా కమలాక్ష పరమేశ్వరునిఁ బ్రార్థించెను. తోడనే యాతటిల్లత ప్రాంతముననుండు యమునానదీ తరంగములలో మెఱసినట్లుండెను. అచ్చోటి కేగి చూడ మృగతృష్ణవలె నాతని కేమియుఁ గన్పట్టలేదు.

అప్పుడు ధ్రువకుమారుఁడు యమునను గూర్చి "తల్లీ! కాళిందీదేవి! నీయందు లీనమైన పరాత్పరాకార మొక్కపరి గనుపింపఁజేయు" మని వేఁడుకొనియెను. కాని యాతని ప్రార్థన మరణ్యరోదనమయ్యెను. ధ్రువుఁడు మగుడికాసారము కడకరిగి హాతాశుఁడయ్యెను. తుదకా బాలుఁడు వేసారి వేదిక యొద్దకేగి, సమాధి నిమగ్నుఁడై కొంతవడికి నొడలు మఱచెను. అంత భగవానుఁడు కరుణించి,

సీ. వారివాహముఁబోలు వక్షఃస్థలంబున
నిందిరాశంప పెంపొందుచుండ
భూమిపద్మమువంటి బొడ్డుతామరయందుఁ
గమలజ చంచరీకంబు మెఱయ
కల్పవృక్షంబు శాఖల మించు బాహుల
నరిశంఖఫలయుగం బందమొందఁ
బరిపూర్ణచంద్రుతోఁ బ్రతివచ్చు మోమున
దరహాస నవసుధాధార లొలుక

తే. గీ. నభముతోఁ బ్రతియైన నెన్నడుమునందుఁ
గనకకౌశేయ సాంధ్యరాగంబు మెఱయ
భక్తలోకైకరక్షణోపాయ సుగుణుఁ
డై జనార్దనుఁ డపుడు ప్రత్యక్షమయ్యె.

పరాత్పరుం డటులఁ బరిపూర్ణసుందర విగ్రహమున ధ్రువుని హృదయకమలమున నిలిచి జ్ఞాననేత్రమునకు దర్శన మొసఁగ, నాతఁడు మితిలేని యానంద మొంది కనుల నానంద బాష్పము లొలుక, మేను బులకరింప, నయనములు దెఱచి చూచెను. అప్పు డాతనికి తన తల్లినుడివిన లక్షణయుక్తుఁడగు లక్ష్మీవల్లభుఁడు గాన్పించెను. చిరకాలమునుండి వెదకుచుండిన వస్తువును గాంచి సంతసించువానివలె ధ్రువుఁ డుత్సాహము నొంది, యా విష్ణుస్వరూపమునకు సాష్టాంగ నమస్కారముఁ

జేసెను. అప్పుడు పరమేశ్వరుండు కనికరించి, యాబాలుని కపోలతలమును దన శంఖముచే నిమిరెను. వేదమయంబైన యాశంఖస్పర్శనమున ధ్రువుఁ డనంత జ్ఞానవంతుఁడై, భగవత్ప్రార్థనవిధాన సమర్థుఁడై, భక్తిభావనిష్ఠుఁడై నిగమవాక్యముల, నీరజాక్షు నిట్లని స్తుతించె.

"దేవా! నీవొక్కరుఁడవయ్యు నీమాయాశక్తిచే సకల జీవజాతు సంయుతంబయిన యీ విశాల విశ్వమును సృజించి, దారువులందున్న వహ్నిచందంబున నానారూపముల నందందు వెలుఁగొందుచుందువు. వేదధర్మములకుఁగంటి యధర్మ మతిశయించు తఱి నాయా సమయములకుఁ దగిన మాయారూపధారివై యుగయుగంబులను ఖాపహరణము సాధుపాలనము గావించుచుందువు. అసార సంసారసాగరమునఁబడి పరితపించువారల, స్వల్పకాలభక్తికి సంతసించి మోక్షమొసంగుచుందువు. దీనరక్షకుండవు. భక్తకామధేనువవు. బృందారకవందితుఁడవు.

మ. అరవిందోదర! తావకీన చరణధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణన జాతభూరిసుఖముల్ స్వానందక బ్రహ్మమం
దరయన్ లేవఁట, దండధృక్పటవిమానాక్షుద్రసుఖాలు, నా
గలోకస్థులఁ జెప్పనేల సుజనస్తోమైకచింతామణీ!

చ. నిరతముఁ దావకీన భజనీయ పదాబ్జసుగంధలుబ్ధులై
వ్వరి మదిఁబొందఁగాఁ గలుగువారలు తత్ప్రియమర్త్య దేహము
న్నరయఁ దదీయ దారతనయాది సుహృద్గృహ బంధువర్గముల్
మఱతురు విశ్వతోముఖ! రమాహృదయేశ! ముకుంద! మాధవా!

సీ. సర్వేశ ! కల్పాంత సమయంబునందు నీ
యఖిల ప్రపంచంబు నాహరించి,
యనయంబు శేషసహాయుండవై శేష
పర్యంకతలమునఁ బవ్వళించి
యోగనిద్రారతి నుండి నాభీసింధు
జస్వర్ణలోకకంజాత కర్ణి
కందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు
రుచినొప్పు బ్రహ్మస్వరూపివైన

తే. నీకు మ్రొక్కెద నత్యంత నియమమొప్ప
భవ్యచారిత్ర ! పంకజపత్రనేత్ర !
చిరశుభాకార ! నిర్మలక్ష్మీవిహార !
యవ్యయానంద ! గోవింద ! హరిముకుంద !

ఇటులఁ బరిపరివిధములఁ బ్రార్థించు బాలునిం గాంచి భగవానుఁడు "ధ్రువుఁడా ! నీ భక్తికి సంతసించితిని. నీ తపోనియమములకుఁ బరమానందభరితుఁడ నైతిని. నీ పుణ్యావశమున నీకు దర్శన మొసఁగితిని. మదీయ దర్శనము వృథగాఁ గాదు. ఏదైన వరమర్థింపుము. ఒసఁగెద" నని పలికెను. అంత ధ్రువుఁడు "దేవా ! చరాచరప్రభూ ! మీకెఱుంగరాని విషయ మొక్కటియుఁ గలదా ? ఐనను భవదాజ్ఞానుసరణి నావాంఛితమును దెలిపెదను. నాజనకుని యుత్సంగమెక్క నాపతోనే

గిన నన్ను, పినతల్లి యాడిన వాక్యము లాత్మయందు నిలిపి, యత్యున్నతమైన దివ్యపదము నాశించి తపమొనరించితిని. దాని ననుగ్రహింప వేఁడెద" నని, దీనాతిదీనుఁడై నుడివెను. అప్పుడు కేశవుఁడు "బాలకా! దేవతలును దిక్పాలురును, సప్తర్షులును, మున్నగువారి పదవులకన్నిఁటికి నుపరిభాగంబున నుండు దివ్యపదము నీకొసంగుదును. ఆస్థలమును సతతము సప్తర్షులు ప్రదక్షిణము సేయుచుందురు. అయ్యది ధ్రువమండల మను పేర లోకత్రయ ప్రళయకాలమునన్నైనను నశ్వరముగాక నిలిచి యుండును. అట్టి స్థానమును నీవు పొందెదవు. ఆపదవి నొందుటకు ముందు, నీ జనకుఁడు వనవాస వాంఛారతుఁడై చనఁగా, నీవట ధర్మమార్గమునఁ జాలకాలము రాజ్యమేలుదువు. అట్టి యెడ నీ సోదరుఁ డుత్తముఁడు మృగయావినోదార్థ మడవుల కేగి మృతినొందును. అతని నన్వేషింప నీ పినతల్లియుఁ గానల కేగి, యొక్క కార్చిచ్చునంబడి కడతేరును.

ధ్రువా! నీవు ధరణీమండలమును పాలించు నెడ, యజ్ఞస్వరూపుఁడను, యజ్ఞభోక్తనగు నన్ను వివిధాధ్వరములచేఁ బూజింపుము. కొంతకాల మటుల నిహసౌఖ్యముల నొంది మృత్యుసమయమున నన్ను స్మరింపుము. అపుడు నీకు చిరాయు వొసఁగి, ధ్రువస్థానమునకుఁ బంపెద" నని సరసిజాక్షుఁ డానతిచ్చి గరుడవాహనారూఢుఁడై వైకుంఠమున కేగెను.

అంత ధ్రువుఁడు పంకజాక్షపాదకమల సేవాభిలాషాయుత్తచిత్తుఁడై నిజరాజ్యాభిముఖుఁడయ్యెను. అట్లాతఁడు మార్గమును బట్టి చనుచు "నయ్యో! ఆఱుమాసములు తపము సల్పి యా భగవానుని సందర్శనముఁ జేసికొని వినశ్వరములయిన కామ్యంబులఁ గాంక్షించితిని. కాని దివ్యమగు మోక్షపదవిఁ గోరితినా? నేనెంత మూఢమతిని? "ఒక దరిద్రుని రాజాదరించి 'యేమికావలయునో కోరుకొమ్మ' న 'నొకదిన వెచ్చమిమ్ము' ని యడిగినట్లు" పరమేశ్వరుఁడు నాకుఁ బ్రసన్నుఁడై వరము లడుగుమన నీర్ష్యయను శత్రువువలనఁ బ్రాప్తంబైన దుఃఖమును బోఁగొట్టుకొనుటకై యైహికవాంఛలఁ గోరితిని. కానిమ్ము. భగవదేచ్ఛ దాఁటరానిది కద! ఇపుడు వగచినఁ బ్రయోజనమేమి? గడచినదానికై చింతించుట "జలముపోయిన చెఱువునకుఁ గట్ట వేయుట వంటిద" ని తలంచెను.



# పండ్రెండవ ప్రకరణము.



"ఔరా! ఈమాటలు విశ్వసించుటెట్లు? ఆఱుమాసముల క్రిందట నరణ్యములకేగిన సుతుఁ డింతవఱకు జీవించి యుండెనా? ఏఘాతుక జంతువున కెఱయయ్యెనో? 'వంశపా

వనుఁడైన కుమారుని నడవిపాలుచేసి యాచంద్రతారార్కమై న దుర్యశమునొందు' మని నాలలాటమున విరించి లిఖించియుం డ నాకు శుభమెటులఁ గలుగును? నాధ్రువుఁడు జీవించియుం డెనను నాశ యేకోశమున నాకులేదు. అట్టిచో ధ్రువుఁడువచ్చు చుండెనని వినుటయా? ఏమో! అంతయు నత్యాశ్చర్యముగ నున్నది. "ఓరీ! వార్తాహరీ! నిజముగనీవు ధ్రువుఁని గాంచి తివా?"

"మహాప్రభూ! తమపుత్రుని నే నెఱుంగనా? ఆబా లుఁడు మందస్మితవదనుఁడై వడివడిగ మననగరమున కేతెంచు చున్నవాఁడు." "ఓరీ! చారుఁడా! ఏబాలకునైననుగాంచి నా తనయుఁడని పొరపడితివేమొ? అట్లేయై యుండవచ్చును. లేకున్న నాకుమారుఁడేడ, వచ్చుటేడ?" నాయనా! ధ్రువా ఎన్నఁడైన నిన్నుఁ గన్నులారఁ గాంచఁగల్గుదునా? సురుచి మాయావాగురం జిక్కి నాసన్నిధానమును బాడుచేసితిని. ఘోరపాప మొనరించితిని. నాజీవితము వ్యర్థము. సాటిరా జులు హీనుఁడని నిందించిరి. పౌరులేవగించిరి. వారి ననవలసిన దేమున్నది. అంతయు నాపాపఫలము...ఒకవేళ నాతనయుఁ డేయై యుండునా వచ్చునది? ఏమో? ఘోరాంధకారమునకు బాపుటకు వెన్నెల రాకూడదా? నారదఋషీశ్వరుఁడు 'కొలఁది కాలమున నీకుమారుఁడు హృషీకేశుని మెప్పించి వరములఁ బొందిరాఁగలఁడ' ని నుడివెనుకదా? ఆసర్వజ్ఞుని పలుకులేల

వ్యర్థమగును. "ఓరీ! నాపుత్రుని నీవానవాలు పట్టితివా?

"దేవా! నామనవిని చిత్తగింపుఁడు. నిక్కముగ దేవర పుత్రుఁడే. సందేహములేదు. ఈయన కాబాలుఁడు మనపట్టణ పరిసరమునకు వచ్చియుండును. ఈసేవకుఁడు ప్రభువుల సముఖమున బొరపడి మాటలాడునా?"

అని వార్తావహుఁడు చెప్ప భూపాలుఁడు విశ్వసించి, సంతోష పరవశత్వమున వెలలేని యొక మణిహారము నతనికిఁ బసదనముగా నిచ్చి, తనయుని గాంచు కౌతూహలము డెందమున నతిశయింప, పథమాయత్తముఁ జేయింప వలయునని సేవకుని కనుమతి యొసఁగి, వార్తావహునిఁ బంపించెను. అతఁడు మున సారథి జవసత్త్వములు గలిగిన హయములఁ బూన్చి బంగరుట రథముఁ గొనివచ్చెను.

అప్పుడు, మంత్రులు, బంధువులు, పౌరులు, మున్నగు వారలు పరివేష్టించి యుండ, విప్రోత్తములు వేదనాదములు సలుపుచుండ, సమస్తవాద్యములు నింగివగుల మ్రోగుచుండ, నుత్తానపాదభూపతి రథారూఢుఁడై, భార్యలును, బుత్రుఁడును శిబికలపై వచ్చుచుండ నగరమును నిర్గమించి, పురోద్యాన సమీపమునకేగి యెదురువచ్చుచున్న ధ్రువుని గాంచెను. తోడనే యుత్తానపాదుఁడు శతాంగమును డిగ్గి ప్రేమవాహిని పొంగి పొరలుచుండ వారిచరణారవింద సంసేవనమునవిగతకల్మషుఁడై,

యున్నతవరములఁ గొనివచ్చుచున్న నిజకుమారునిం గాంచి, డాయఁబోయి హర్షపులకితగాత్రుఁడై తటాలునఁ గౌఁగిలించి, శిరమునిమిరి చుబుకమునుబట్టుకొని మోము ముద్దిడికొనియెను. ఆసమయమున రాజేకతెగని యానంద బాష్పములఁ గార్చి ధ్రువుని శిరోజములఁ దడిపెను. అప్పుడా భూకాంతుఁడు "నాయనా! ఎన్నాళ్లకు నాకన్నులఁబడితివోయి! నారదుఁ డాడిన మాటలు విని యెప్పుడు నీవరుదెంచి నాకుఁ బ్రియము గూర్తు వాయని తలంచుచుంటిని. నేఁటికగి లభించినది. నాజన్మము తరించినది. దుఃఖముపశమించినది. పుత్రకా! నీ పినతల్లి నిన్నాడిన పరుషవచనములకుఁదలయొగ్గి, నిన్నాదరింపనైతిని. మిక్కిలి పాపకార్య మొనర్చితిని. తత్ఫలము నే ననుభవింతును గాక! జనకుఁడు పాతకుఁ డని నీమది నుంచకుము. దీర్ఘాయుష్మంతుఁడవై చిరయశస్కుఁడవై మను"మని యాశీర్వదించెను.

అప్పుడు ధ్రువుఁడు వినయావినమిత శరీరుఁడై జనకుని యాశీస్సులనంది, తండ్రి పాదముల కడ ఫాలభాగముంచి నమస్కరించెను. తరువాతఁ దల్లులకు నమస్కృతులు గావించి తమ్ముని గాఢాలింగనముఁ గావించుకొనియెను. పిదప జననీజనకులఁగాంచి "తలిదండ్రులారా! మీరొనరించిన పాపమొక్కింతయు లేదు. మీ రెట్టి పాపఫలమునుబొందరు. మిక్కిలి పుణ్యకార్యమే యొనరించితిరి. నాఁడు పినతల్లిగారాడిన మాటలను మీరు తిరస్కరించి, నావనగమనమున కనుజ్ఞ నొసంగనిచో,

నాకింతటి మేలు కలుగునది కాదు. మీయాశీర్వాదముల ఫలము వలనను, శ్రీరమణుని పరమ కరుణావలోకనమునను, వరము లఁబడసి వచ్చితిని. పూర్వము జరిగినదానికి వగవుఁ జెందకుఁడు." అని పలికి నిజజననింగాంచి "అమ్మా! ఆనాఁడు నీ 'వడవులకేగి లోకపితన్ధ్యంపు మ'న నట్లేయేగి మన్మనోరథ సిద్ధిఁబడసితిని. ఇన్ని దినములనుండి నాకై దిగులుపడితివా" యని తల్లిం గౌఁగిలించుకొనియెను. సునీతియుఁ దనయుని బిగ్గఁ గవుఁగిలించుకొని ముద్దాడి, పుత్రప్రేమ పారవశ్యమునఁ గొంతవడి దేహమును మఱచెను.

జలము తా నెప్పుడును సమత్వమును బొందునట్లు, విష్ణుభక్తులు పరము సమదర్శులై యుందురు. అందువలననే ధ్రువుఁడు పూర్వము పినతల్లియాడిన మాటలను లెక్కసేయక, భక్తిపూర్వక నమస్కారముఁ గావించెను. సురుచియుఁ దొల్లింటి చరితమును స్మరింపక "చిరజీవి గమ్మని" యాశీర్వదించెను. పిమ్మట ధ్రువుఁడు ధరణీసురులకు నమస్కరించి, వారి యాశీశ్శులను బొంది తక్కిన పౌరుల నందఱి నాదరించెను.

అప్పుడు పౌరులు సునీతింగాంచి "తల్లీ! నీపుణ్యావశమునఁ గానలకేగిన సూనుఁడు తీవ్రమైన తపము సల్పి సప్తర్షులొందరాని దివ్యపదము నొంది వచ్చినాఁడు. ఈతఁడు మహాదృష్టవంతుఁడై భూమండలమును బాలింపఁగల సమర్థుఁడు

మీఁదుమిక్కిలి పరమభాగవతోత్తముఁడు. ఆకమలాక్షుని గొల్చువారు లోకభయంకరమైన మృత్యువును గెల్చి ధన్యులయ్యెదరు. అట్టుల నీతనయుఁడును లోకేశు నర్చించి చిరజీవియై వచ్చినాఁడు. ఇదియంతయు నీ నోము ఫలమ"ని పలుభంగులఁ బ్రశంసించిరి.

అంత నుత్తానపాదుఁడు సుతుని గజారూఢుని గావించి, సకలజన సమేతుఁడై, సంతుష్టాంతరంగమునఁ బురాభిముఖుండై చనియెను. రాజమార్గమునం గల పౌరకామినులు కరీంద్రముపై నెక్కి వచ్చుచున్న ధ్రువునిఁ గనుఁగొని దివ్యసుమరాజములను, సువర్ణాక్షతలను జల్లి, హేమపాత్రంబులఁ గర్పూరహారతు లొసంగిరి. ధ్రువకుమారుఁడట్లు బంధుమిత్రామాత్య పౌరజన పరివృతుఁడై సర్వాలంకారశోభితంబగు నగరమును నిర్గమించి, స్వర్గముం బ్రవేశించు సురరాజుకైవడి నిజసౌధమున కేగి, సంతోషముగఁ గాలము గడుపుచుండెను.



## పదమూఁడవ ప్రకరణము.



ఒకనాఁ డుత్తానపాదమహారాజేకతమ్మునఁ గూరుచుండి, మంత్రిని రావించి యాతనితో "సచివా! నాకెంతకాలము నుండియో యడవులకేగి మునివృత్తిఁబూని యాలోకేశు

నారాధించు కోరిక కలదు. ఇంతకాలము నుండియు రాజ్య
భారము నాపైఁ బడుటవలన నావాంఛితము తీరకపోయినది.
ఇపుడు రాజ్యపాలన మన్న నాకు విసువు జనించుచున్నది. వృద్ధుఁ
డనైతిని. జవసత్త్వము లుడిగినవి. బుద్ధిమాంద్యము సంభవిం
చినది. ఇంక ధరణీపాలనముఁ గావింప నేరను. నాతనయుని ప్రభా
వ మెల్లరకుఁ దెలిసియేయున్నది కదా! ఆతఁడిపుడు ప్రజానురం
జకుఁడై, నవయౌవన పరిపూర్ణుఁడై, రాజ్యపాలనాదక్షుండై
యున్నవాఁడు. అట్టివానికిఁ బట్టముఁగట్టి వానప్రస్థాశ్రమమున
జీవితశేషముఁ గడుపుట మేలుగదా! కావున ధ్రువునిపట్టాభి
షేక మహోత్సవము సత్వరముగ జరుగుటకై తగినయేర్పా
టులు గావింపు" మనియెను.

మంత్రియు నాపలుకు సమ్మతించి, "భూపాలా! దేవర
యభిమతానుసారముగ 'శుభస్య శీఘ్రమ్మ' నట్లు ధ్రువరా
జ్యాభిషేకము వెళంబ జరుపవలయును. ఏలయన ధ్రువకుమా
రుఁడు, వివిధ రాజనీతివిదుఁడై, సకలకలాప్రవీణుఁడై, చతురమ
తియై, భక్తకులాగ్రణియై, యున్నవాఁడు. ఇన్ని లక్షణములు
గలిగి, పరిపూర్ణయౌవనవిలాసుఁడైన రాకుమారుని రాజ్యల
క్ష్మీలలామ శీఘ్రముగ వరింప నువ్విళ్లూరుచుండును. కావున
ధ్రువ పట్టాభిషేకము నిప్పుడే నిర్వర్తించుటకు సుముహూ
ర్తము నేర్పాటు చేయుదము. తత్పట్టాభిషేకోత్సవముఁ గన్ను
లార నెప్పుడు గాంతుమాయని పౌరులును సంభ్రమోత్సాహ

ములతో నెదురు చూచుచున్న వారలు" అని పలికి రాజాజ్ఞ నొంది, రాజపురోహితుని రావించి, మొక్క శుభముహూర్తమును బెట్టించి, యీసమాచారము రాజ్యమంతటను జాటంబంచెను.

ఆ మరదలవిని పౌరులెల్లరును మిక్కిలి మోదమంది తమ తమ సౌధముల నతివైభవముగ నలంకరించుకొనిరి. అప్పుడా పట్టణ సౌందర్య మేమని చెప్పవచ్చును! పెద్దపెద్ద మేడలగోడలు బంగరుపూతం పూయంబడి ధగధగ మెఱయుచుండెను. అచ్చటచ్చటం గల దేవాలయ గోపురములు ముత్యాల తోరణములచేఁ బ్రకాశించుచుండెను. నలుడలఁ గల కోటబురుజులు రంభాస్తంభములచే నలంకరింపఁబడి రాజిల్లుచుండెను. ప్రతి గృహప్రాంగణమును శుభసూచకములగు రంగవల్లులచే రాణించుచుండెను. వేయేల, ప్రతి గృహమును బెండ్లియిల్లువలెఁ గళకళలాడుచుండెను.

ఆదినమే ధ్రువుని రాజ్యాభిషేకము. శుభముహూర్తమాసన్నమగుడు వృద్ధరాజు ధ్రువరాజకుమారుని రథాధిరోహుని గావించి, బయలుదేర పురోహితులును, బ్రాహ్మణ బృందములును వేద ప్రూర్వకాశీస్సులు సేయుచు, ముందు నడచుచుండిరి. గాయకులు మనోహరముగ గాన మొనరించుచుండిరి. నర్తకీమణులు మిక్కిలి నేర్పుతో నాట్యములు సలుపుచుండిరి.

పలువిధములగు మంగళతూర్యములు మెలయుచుండెను. అప్పుడు వారెల్లరును గడుంగడు నుత్సాహముతో నూరేగిరి. అట్లూరేగి, కొంతవడికి సభాస్థానమున కేతెంచిరి. అచట, నగపాలుఁడు, నవరత్నద్యుతులచే ధగద్ధగాయమానముగ వెలుఁగొందు సింహాసనముపైఁ గుమారుని గూర్చుండఁజేసి మణిశోభిత సువర్ణకిరీటమును శిరమునమొంచి దీవించెను. వైదిక బ్రాహ్మణులు మంత్రోక్తుల నాశీర్వదించి, యక్షతలు చల్లిరి. పురోహితులు విఘ్నశాంతముగ దీవించి, ధ్రువుని శిరమున సేసలిడిరి. ఆజనార్ణవమునుండి, యప్పుడొక్కుమ్మడిగ జయజయ నాద తరంగములు లేచి యుప్పొంగెను. వివిధవాద్యము లొక్కపరి మ్రోగెను. గాయకులు మంగళగీతములఁ బాడిరి. కామినీమణులు కర్పూరహారతులొసంగి, ధ్రువునిపైఁ బుష్పములనుజల్లిరి. దేవతలీ శుభకార్యమున కానందించి పుష్పవృష్టి గురియించిరి.

అట్లు కుమారుని రాజ్యాభిషిక్తునిగా నొనరించి, కొంత కాలమున కుత్తానపాదుఁ డాత్మగతిఁ జెంద విపినముల కేగెను.

## పదునాల్గవప్రకరణము.

ధ్రువుఁడు ప్రజానురంజకుఁడై ధర్మమార్గమున రాజ్యమును బాలించుచుఁ గొన్నిదినంబులకు శింశుమార ప్రజాపతి

కుమార్తెయగు 'భ్రమి'యను పూఁబోఁడిని బరిణయంబయ్యెను. కొంతకాలమునకు ధ్రువుఁ డా కాంతవలన 'కల్పుఁడు వత్సలుఁ'డను కుమారులఁ గనియెను. పదంపడిధ్రువుఁడు వాయుపుత్రియైన 'యిల' యను లలనను బెండిలియాడి యామెవలన నుత్కలుఁడను పుత్రుని, యొక సుందరరూపిణియగు పుత్రికను గనెను.

ధ్రువ భూపాలుఁ డటు భార్యాపుత్త్రులతోడను, తమ్ముండగు నుత్తమునితోడను, తల్లులతోడను సుఖముగఁ గాలక్షేపము సేయుచుండ నొకనాఁడు త్తముఁడు హిమవంతప్రాంతకాంతారసీమకు వేఁటకై యేగి, యకారణ కలహమున యక్షరాజుతోఁ బోరాడి హతుఁడయ్యెను. అచ్చటి హతశేష సైనికులేతెంచి యావృత్తాంతమును ధ్రువభూపతికిని, సురుచికిని తెలియఁజేసిరి. సురుచి యావార్త నాలించి పుత్రశోకమునఁ గుందుచు, తనయుని మృతకళేబరమైనను గాంచు నాసతోఁ దత్ణము బయలుదేరి, వనములంబడి పోవుచుండెను. ధ్రువునకీ విషయము మిగుల విషాదమును గలిగించెను. మంత్రిని రావించి యక్షరాజునకుఁ దగిన ప్రతీకారము సేయవలెనని చెప్పెను.

సురుచి యట్టుల దుర్గమారణ్యమున జనుచుండ గహనదహనుఁడు చెలరేగి, యామె పోవు మార్గమును జుట్టుముట్టి దహింపఁగడఁగెను. అట్టియెడ సురుచి మిపులఁ బరితపించి చేయునదిలేక పాపమాకార్చిచ్చునంబడి యకాలభీకర మృత్యుముఖంబునఁ బడియెను.

సురిచి కానలఁబడిపోయి, చిచ్చునఁబడి చచ్చిన విషయము గూడ ధ్రువునకుఁ దెలియవచ్చెను. అంత నాతఁడు మాతృభ్రాతృ మరణములకు శోకవ్యాకులచిత్తుఁడై, యుత్తముని జంపిన యక్షులవలనఁ గదా యింత కలిగినదని తలంచి, వారల గర్వమడంప నపారపరివారపరివృతుఁడై జయశీలమగు రథము నెక్కి యుత్తరాభిముఖుఁడై చనియెను.

ఆ సేనాసమూహము మహాసంరంభమున హిమవద్గిరికిం జని, యచట భూతగణసేవితంబును, గుహ్యకసంకులంబును నగు నలకాపురిం గాంచెను. ధ్రువుఁడచ్చట సైన్యములనాపి, కోపోద్దీపితచిత్తుఁడై, సకలదిశలును బిక్కటిల్లునట్లు శంఖమును బూరించెను. ఆ బెడిదమగు శంఖధ్వని విని యక్షకామినులు భయంకరచిత్తలైరి. అపుడు యక్షయోధు లాయుధహస్తులై విరోధియెవ్వఁడో తమపై దండెత్తి వచ్చెనని తలంచి, యొక్కపెట్టునఁ గదలివచ్చి, శీతనగ ప్రాంతమున ధ్రువభూపతిసేనావారము నవలోకించి, వారితో యుద్ధమొనర్పఁ దలపడిరి.

అట్లెదిరించిన యక్షసైన్యముల ధ్రువుఁడు తనశస్త్రకలానైపుణ్యము మెఱయ నిశితశరములేసి మూర్ఛనొందఁజేసెను. కొంతవడికి వారలు మూర్ఛదేరి దండతాడిత దుష్టభుజంగకోటివోలె భయంకరులై గదా, శర, క్షురిక, పట్టిస, తోమర,

శూలాద్యాయుధములచే సారథియుక్తముగ ధ్రువుని నొవ్వఁ జేసిరి. అందుల కావంతయు ధ్రువుఁడు చలింపక, శత్రుభయంకర కార్ముకమును దాల్చి వాఁడిబాణపరంపరల ఝుంఝూనిలుఁడు మేఘపటలి, కాఱుఁదోలురీతి వైరివీరుల బాఱఁదోలెను. అంతతో నూరకుండక మఱికొన్ని నిశితశిలీముఖములేసి విరోధినాయకుల కాయములు గాయపడఁజేసి కంచుకములఁ దెగఁగొట్టెను. అప్పుడెందఱో వైరివీరులు మృతినొందిరి. చావఁగా మిగిలినవారు ధ్రువుని శస్త్రాగ్నికోర్వఁజాలక సమరవిముఖులై చనిరి.

అట్లగిన కుబేరానుచరులొక్కచోఁ జేరి, ధ్రువుని కెదురుగాఁ జని కదన మొనర్పఁజాలమని నిశ్చయించిరి, మాయాసమరమును సలుపఁ దీర్మానించిరి. ధ్రువుం డది గ్రహించి తన రథము వైరిపురమునకుఁ బోనిమ్మని సారథితోఁ జెప్పెను. అతడట్టియొనరింప నగరము కానరాక మాయమయ్యెను. తోడనే నలుగడలందును సుడిగాలి వేచి రజఃపటలంబులుదోచెను. ఆధూళి చెలరేఁగి యాకాశమును గప్పివైచి మార్గావరోధమును గల్పించెను. అప్పు డాకసమున కారుమేఘములు గ్రమ్ముకొని భయంకర గర్జనలు సలుపుచు గాలివర్షమును గురియం జేయఁగడంగెను. ఆవర్షమునుండి దుర్గంధయుతములైన మస్తిష్కపురీషమూత్రములు కొండలవలెఁ దండోపతండములుగఁ బడఁజొచ్చెను.

ఆవిచిత్ర సంఘటనమారసి ధ్రువుఁ డాశ్చర్యమగ్నుఁడై యేమియుఁ దోఁచక నిటునటు చూచుచుండెను. సమయమున మహర్షులు గొందఱేతెంచి, "ఓయీ! ధ్రువుఁడా! ఇవన్నియు రాక్షస మాయాకృత్యములు. వానిని హరింప నారాయణుండే సమర్థుండు. కావున నారాయణాస్త్రమీయెడఁ బ్రయోగింపుము. సూర్యోదయమునఁ జీకటివోలె వారి మాయలన్నియును బటాపంచలగు" నని నుడివి చనిరి. ధ్రువుం డంత నత్యంతానందమొంది, మనమున లక్ష్మీకాంతుని స్మరించి, నారాయణాస్త్రమును బ్రయోగించెను. తోడనే గుహ్యక మాయాంధకార మంతయు, నిర్మలవివేకోదయమున సంశయరాగాదికములవలె నశించిపోయెను. అమ్మహాస్త్రమునుండి దుర్వారనిశిత శిలీముఖంబులు లేతెంచి, పుంఖానుపుంఖములుగ నడవియందుఁ జొచ్చు శిఖిసంఘాతమును బోలి, విపక్షవర్గ వక్షంబులఁ జీల్చివైచెను. అపుడు విరోధు లెందఱో కొండల పిండులవలె నందందుఁ గూలిరి.

ఆమహాభీభత్సమును జూచి యాత్మసంయమనము సిద్ధించిన ధ్రువుని చిత్తము తల్లడపడఁ జొచ్చెను. ప్రశాంతరమణీయమై సత్త్వగుణసంశోభితమై దేవదేవుని దివ్యదర్శనమున సుస్థిరవికాసము నొందిన యాతని హృదయాబ్జ ముదారభావబంధురమయ్యెను. అప్పు డాతఁడు తన మనమున "అయ్యో

కేవల తాత్కాలిక కోపవిజృంభణమునఁ జేసి, యెట్టి ప్రాణి హింస నొనరించితి. ఈ కిల్బిషమునుండి నేనెట్లు విముక్తి నొందుదు" నని పశ్చాత్తాపపడుచుండ స్వాయంభువుఁడు మౌని బృందారక సమేతుఁడై యచ్చటి కరుదెంచి మనుమని గని యిట్లులనియె.

"నాయనా! నీ సోదరుఁడు గతించినందులకై యిన్ని యక్షులమూకలను జంపితివి. ఇంక రోషముడుగుము. మన మను కులమున కింతటి దారుణసంగ్రామ కార్యము దగదు. అదియునుఁగాక దేహాభిమానమున భూతహింస యొనర్చుట భక్తుఁడవగు నీవంటివారికుం దగదు. సర్వప్రాణులయందును సమత్వమున వర్తింపనివారు పరమేశ్వరుని బొందనేరరు. సృష్టిస్థితిలయములకు నారాయణుఁడే కారణుఁడైయుండ నీ భ్రాతృమరణమునకు ధనదానుచరులా కారణులు? ఇదియంతయు నొకపరి జ్ఞాననేత్రమున గాంచుము. వారి పూర్వకృత కర్మానుసరణి నిందఱు యక్షులు నీచే హతులైరి. నీవు జంపినదియుఁ గాదు. మించినదాని కింత జింతింప నవసరము లేదు. సర్వాపదలకుఁ గారణమైన కోపమునువీడి యక్షవధోద్యోగమును మానుము. ఈవఱకొనరించిన యపచారమునకై పరమేశ్వరుని వేడికొనుము. గుహ్యకనికాయముల సంహరించుటవలన వారికధినాథుఁడైన కుబేరున కపకార మొనరించితివి. నీవాతని బ్రసన్నునిగఁ జేసికొనుము."

ఈరీతి వచియించి ధ్రువునిచేఁ బూజితుఁడై దేవఋషులతోఁ గూడుకొని స్వాయంభువమనువు వెడలిపోయెను. ధ్రువుఁడప్పుడు యక్షచారణ సిద్ధవిద్యాధరాది జనసేవితుఁడై యున్న ధనదుని కడకేగి, తన యపచారమును మన్నింపుమని వేఁడెను. అందులకు రాజరాజెంతయు సంతసించి, "ధ్రువా! నీ తాత యుపదేశించినటులు యక్షులను నీవు సంహరింప లేదు. నీసోదరుఁడును వారిచేఁ జావలేదు. కాలచోదితులై వారలే, లయము నొందిరి. దీనికై కుందకుము. అనంతామేయశక్తియుక్తుండైన హరిని గొలువుము. నీకు మేలొదవును. చిరంజీవివై మను"మని మనువు మనుమని యాశీర్వదించి నిజసేవకులతోఁ దిరోహితుండయ్యెను. అంత ధ్రువుఁడు తన సేనలఁ గైకొని యాత్మపురమున కేగెను.

# పదునైదవప్రకరణము.

ధ్రువుఁడు రాజపాలనముఁ జేయునెడ నెన్నియోయజ్ఞములు సలిపి యజ్ఞవిభుండైన పుండరీకాక్షునకుఁ దృప్తిగలిగించెను. అటుల సర్వవిధసవనము లొనరించుచు, ధర్మసేతురక్షకుఁడై, యిరువదియాఱువేల వత్సరములు నాకరాజ్యమువోలె నాభాగవతోత్తముఁడు స్వీయరాజ్యమును పాలించెను. పిమ్మట నతఁడు

ధరణీపరిపాలన వాంఛవీడి, బంధుమిత్రపుత్రవిత్తవనితాదు లశాశ్వతములని భావించి, విరక్తుఁడై యొక దివ్యసుముహూర్తమున మహావేడుకతోఁ దన జ్యేష్ఠపుత్రునకుఁ బట్టముఁ గట్టి, శాంతి జీవితమును గడుప విపినసీమల కేగ వెడలెను. అట్లతఁడు,

సీ. పురము వెల్వడి చని పుణ్యాభూబదరికా
ఘనవిశాలానదీ కలిత మంగ
ళాంబు పూరంబుల ననురక్తిమైఁ గ్రుంకి
కమనీయ పరిశుద్ధ కరణుఁడగుచుఁ
బద్ధాసనస్థుఁడై పవనుని బంధించి
నెలకొని ముకుళిత నేత్రుఁడగుచుఁ
హరిరూప వైభవ ధ్యానంబు సేయుచు
భగవంతు నచ్యుతుఁ బద్మనేత్రు

తే. నందు సతతంబు నిశ్చలమైన యట్టి
భక్తిఁ బ్రవహింపఁ జేయుచుఁ బరమమోద
బాష్పధారాభిషిక్తుండు భవ్యయశుఁడుఁ
బులకితాంగుండు నగుచు నిమ్ములఁ దనర్చి.

స్థూలదేహమును మఱచి కూర్చుండియుండెను. అప్పుడు దశదిశలు కోటిసూర్యప్రకాశము వోలె వెలుఁగొందుచు నంత రిక్షమునుండి యొక దేవవిమాన మరుదేర, ధ్రువుఁడు కనులు విచ్చి యందుఁగల విష్ణుకింకరులఁ గాంచి సంభ్రమంబున లేచి,

వినతులొనరించెను. ధ్రువుని వినయభావమునకును, విష్ణుపాదారవిందార్పిత చిత్తమునకును, విష్ణుదూతలు ప్రీతియుక్తులై "ధ్రువభూనాథా! నీవైదేండ్ల వయసునఁ దపమాచరించి ఖగవాహనుని మెప్పించితివి. అది కారణముగ నాదేవదేవుఁడు వాత్సల్యచిత్తుఁడై నిన్ను వైకుంఠమునకుఁ గొనితెమ్మని మమ్ములఁ బుత్తెంచె. సూర్యచంద్రాది నక్షత్రగణంబు లేపదంబును నిరంతముఁ బ్రదక్షిణముఁ జేయుచుండునో యట్టిపదము నొందుటకై యీవిమానమధిరోహింపుము. కైకొనిపో యెద" మని వాకృచ్చిరి.

అది విని ధ్రువుం డత్యంతాహ్లాద హృదయుఁడై విమానమునకుఁ బ్రదక్షిణముఁ గావించి, విష్ణుకింకరులకు వందనం బాచరించి, విమానాధిరోహణముఁ గావించెను. అపుడు ధ్రువుఁడు తన మనమున "అయ్యో! దీనయైన నాజనని దిగనాడి త్రివిష్టపంబున కే నొక్కరుండ నేగుచుంటినే" యని చింతించెను. అయ్యెడి మధుసూదను భటులు గ్రహించి తమఅగ్రభాగమున విమానారూఢయై వినువీథిఁ జనుచున్న సునీతిని జూపింప ధ్రువుఁడు సంతసించెను. అటుల మాతృసమేతముగ నతుల విలాస విమానారూఢుఁడై, యాత్తానపాది వైకుంఠమున కేగి యావనజనాభుని సెలవుగై కొని సకలమండలము నిర్గమించి యావలనున్న ధ్రువపదమును జేరెను. అపుడు స

దుందుభులు మ్రోగెను. పుష్పవృష్టి గురిసెను. గంధర్వులు గాన మొనరించిరి. దేవవేశ్యలు నాట్య మొనరించిరి.

హరిసేవాపరాయణులకును, బరిశుద్ధాత్ములకును, సర్వభూతసమవర్తనులకును, జేరనగువై త్రిలోకముల నిజకాంతిచేఁ బ్రకాశింపఁ జేయుచున్న హరిపదమును జేరి, ధ్రువుఁడు సకలలోకచూడామణియై రాజిల్లుచుండెను. నారదుఁడే దివ్యకథాగీతమును నఖిల లోకముల గాన మొనర్చెను. నేఁటికి నాభాగవతశిఖామణి నుత్తర దిశను నక్షత్రరూపమున గాంచుచునే యుందుము. ఈపరమ పురుషుని కథఁ జదివినను, వినినను, ఇడుములు దొలఁగి భగవద్భక్తి యలవడి పరమపదము లభించును.

సమాప్తము.

---

ఓమ్ తత్సతు శ్రీసీతారామచంద్రార్పణమస్తు.



# "ఆంధ్రదేశము."



"...ఆధునికాంధ్ర యువకుల స్వర్ణ స్వప్నములెల్ల ందు దొలుకాడు చున్నవి."

(గృహలక్ష్మి.)



# "మల్లెపూలు"



"మల్లెపూలు పూర్తిగ చూచినాను. భాషయును, భావములును గూడ రమ్యముగ నున్నవి. రంగులును, తావియు గల విరులవలె మనోహరముగ నున్నవి."

(వున్నవ లక్ష్మీనారాయణ.)

